

# కొత్త సుప

## నీలి డిటర్జెంట్ బార్



మురికితో మీ నిరంతర పోరాటం ముగిసినట్లే.
న్యూ సుప డిటర్జెంట్‌బార్ సబ్బు నురుగులో
తెల్లదనం బూడిదరంగు మురికిని వదిలించి
మీ బట్టలకు తెల్లదనాన్ని ప్రకాశాన్ని తిరిగి
ప్రసాదిస్తుంది. తెల్ల బట్టలు మరింత తెల్లగాను,
రంగుబట్టలు మరింత ఆకర్షణీయంగాను,
కనిపిస్తాయి. అన్నిరకాల దుస్తులకు ఇది
అత్యుత్తమం. మరే ఇతర డిటర్జెంట్‌బార్ కన్న
న్యూ సుప డిటర్జెంట్‌బార్ చాలా పొదుపైనది.




**మీ బట్టలకు తెల్లని**
**తెలుపును కాంతిని**
**తిరిగి తెస్తుంది**



HARYANA DETERGENTS LTD

maa HDL 1b-79 Tel





## ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు !

దేశోద్ధారక కాశీనాధుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు ·

[1938 1972]

శుక్రవారం 28 9 '79

సిద్ధార్థినామ సం. ఆశ్వయుజ శు. సప్తమి

**సంపుటము 73 : సంచిక 5**

సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 41-60

ఆరు మాసాల చందా రు. 20-80

విడి ప్రతి వెల 75 పైసలు

**ఆంధ్రపత్రిక కార్యాలయము**

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# రెండు బట్టలూ పోలియెస్టర్ ముద్ర ఉన్నవే.



తక్కువ పోలియెస్టర్ పాళ్ళు గల బట్ట

'టెరీన్' ముద్ర గల బట్ట

# 'టెరీన్' ట్రేడ్ మార్క్ తెచ్చింది తేడా!

ఈ రోజుల్లో మార్కెట్లోకి నాసిరకాల పోలియెస్టర్ మిశ్రిత బట్టలు మిమ్మల్ని ఏకమార్చ పెట్టేందుకు ఓ ముద్ర వేయబడి వరదలా వచ్చి పడిపోతున్నాయి. వీటిలో ఏవి కూడా పోలియెస్టర్ బట్టలుండాల్సినట్లు ఉండవు. కొన్ని సార్లు ఉతికితే సరి! ముడతలు పడతాయి, కుచించుకు పోతాయి, చిత్రంగా తయారవుతాయి—అందుకు కారణం వాటిలో పోలియెస్టర్ యొక్క పాళ్ళు తక్కువ కావడమే మరి.

ముడతలు పడకుండా, కుచించుకు పోకుండా ఉండేందుకుగాను కేఫీ (CAFI) వారు తనిఖీ కోసం చేసే అత్యంత కఠినమైన పరీక్షలలో గెలుపొందిన బట్టల యొక్క బట్టలకు మాత్రమే 'టెరీన్' ట్రేడ్ మార్క్ లభిస్తుంది. అంటే 'టెరీన్' బ్రాండెడ్ ముద్ర ఉన్న బట్టలలో మాత్రమే పోలియెస్టర్ సరిగ్గా మిశ్రితం చేయబడుతుందన్నమాట. అందుకే మరి ఆ బట్టలు కొనిగా. మళ్ళీ మళ్ళీ ఉతికినా కూడా కొత్త వాటి లాగే కనిపిస్తాయి.

ఆ, చాలెండ్లూ పెద్దైతేనేంలే అది సంతృప్తి పడకండి. నూటికి నూరు పాళ్ళూ పోలియెస్టర్ సరిగ్గా మిశ్రితమైన బట్టలనే కొంటున్నారో లేదో తెలుసుకోండి. 'టెరీన్' ట్రేడ్ మార్క్ ఉన్న బట్టలనే ఎంచుకోండి—మీరు వెచ్చించిన డబ్బుకు సరైన విలువను అందుకోండి.




## 'టెరీన్' అంటే సరైన మిశ్రితం అన్నమాట–ఎప్పుడైనా సరే!

® 'టెరీన్'—కెమికల్స్ అండ్ ఫైబర్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.

CHAITRA-CAFI-592 TEL

# ఉత్తరాలు

## ముఖచిత్రం

నాట్య గణపతి ముఖచిత్రంతో వెలువడిన 31-8-79వ తేదీనాటి ఆంధ్రుల అందాల అభిమాన ఆనంద ఆంధ్ర సచిత్ర వారపత్రిక వినాయకచవితి ప్రత్యేక సంచిక, ఎంతో హృద్యంగ ఉంది. చిత్రకారుడు శంకు గారికి మా హృదయపూర్వక అభినందనలు.

ఈ సంచికలో ప్రచురితమయిన మూడు కథలు ముచ్చటగా ఉండి, హాస్యపు జల్లులను కురిపించాయి క్రొత్తగా ప్రారంభమయిన శ్రీమతి ప్రమీలా జవార్ధన్‌గారి ప్రేమపాశం సీరియల్ మొదట్లోనే మిక్కిలి ఆసక్తిదాయకంగా ఆనందదాయకంగా ఉంది. నళిని సీరియల్ కూడా ఇంట్రస్ట్‌గా కనసాగుతున్నది.

వినాయకుడు విఘ్నరాజు ఎలా అయ్యాడు, కుడుములు ఉండ్రాళ్లు, యువ ధర్మరాజు కడుకును మింగిన గణపతి అనే వ్యాసాలు ఆసక్తికరంగా ఉన్నాయి.

వినాయకునిపై ప్రచురితమైన కార్టూన్లు చదివి కడుపు చెక్కలయ్యేటట్లుగా చాలా సేపు నవ్వుకున్నాం. డా. పి. నారాయణరెడ్డి గారి కవిత మాటల్ని మింగకు చాలా బాగుంది.

గంటా ఉమాశంకర్‌రెడ్డి, న్యాయపతి రమేష్ బాబు, (బరంపురం.)

## కథలు

31.8.79 వినాయకుడి ముఖచిత్రంతో వెలువడిన పత్రికలో చిదంబర రహస్యం, కాలప్రభావం కథలు నాకెంత నచ్చినవి. అందులో రఘులాగ మేము కాడ కథ చదివి నవ్వుకున్నాము. రాగరేఖలు సీరియల్ ముగింపు మేము అనుకున్నట్టే అయింది.

డి. శ్రీశైలజ (కోయిలకుంట్ల).

* *

నాట్యగణపతి ముఖచిత్రంతో వెలువడిన — 31.8.79 నాటి ఆంధ్రసచిత్రవారపత్రిక (జన్మదిన సంచిక) లో చిదంబరరహస్యం, కాలప్రభావం కథలు చాలా బాగున్నాయి. కూతురికి పునర్వివాహం చేద్దామను ఉద్దేశ్యముతో రవి, సుధ, రావుగారు ఆడిన నాటకం బాగుంది.

రాగరేఖలు సీరియల్ ముగింపు చాలా బాగుంది. ప్రేమపాశం సీరియల్ మొదటనుంచే మా మనసులను ఆకట్టుకుంది. వినాయకునిపై కార్టూన్‌లు చాలా బాగున్నాయి.

రాజకీయంలో జరుగబోయే తాజాపరిణామాలు ముందుగానే లోకంపోకడతో తెలియజేస్తున్నారు.

పిళ్లా మహాలక్ష్మినాయుడు, ఉమాదేవి, మధు పద్మ, సతీష్ (ఏటికొప్పాక.)

## సీరియల్

చిట్టారెడ్డి సూర్యకుమారిగారి నళిని సీరియల్ చాల ఇంటరెస్టింగ్‌గా ఉన్నది. ప్రేమపాశం సీరియల్ కూడా బాగున్నది. వినాయకుడు విఘ్నరాజు ఎలా అయాడు? వ్యాసం, చిదంబర రహస్యము కథ చాలా బాగున్నాయి. వాణిశ్రీగారి కాలప్రభావం కథ ఏమంత బాగా లేదు.

ఎస్. శ్రీనివాస్, వి. శైలేంద్రరెడ్డి. (హైదరాబాద్)

* * *

వినాయకచవితి సంచిక నాట్యగణపతి ముఖచిత్రంతో ఆకర్షణీయంగా అందింది. థాంక్స్....

జోకులు బాగున్నాయి. రాగరేఖలు సీరియల్ ముగిసింది. కానీ అందులో త్యాగాలపాళ్ళు ఎక్కువ అనిపిస్తుంది. సామాన్యవిజ్ఞానంగుడు ఉపయోగకరంగా ఉంది.

మటికొన ప్రకాష్ (విజయనగరం).

## కార్టూన్లు

వినాయకచవితి సంచికలో పండుగ సందర్భముగా ప్రచురించిన కార్టూన్స్ మమ్మ కడుపుబ్బ నవ్వించాయి.

సి. హెచ్. మనోహర్, ఎస్. దామోదర్. (పెద్దపల్లి.)

## ఢిల్లీ డ్రామా చూడరబాబూ!

చిదంబర రహస్యం కథలో చివరికి పళ్ల చీరెం దుకు తీసుకున్నారన్న సుధ ప్రశ్నే నాకు తలెత్తింది. రవి ఎందుకు తీసుకున్నట్టో నాకు అర్థం కాలేదు. 7.9.79 సంచికలో సిరాజిగారి ఢిల్లీ డ్రామా చూడర బబూ చాలా బాగుంది. ఒక వైపు కూరగాయల ధరలు, నిత్యావసర వస్తువులు కొనలేక బాధపడుతున్న ప్రజల గోడు వినేదెవ్వరు. ఈ ప్రభుత్వం ఎవరికోసం. ప్రధానమంత్రులయి వారి వారి స్వలాభాలు చూసుకుని పోట్లాడుకుంటు న్నారేగాని దేశం విషయం యిప్పటికి ఎవ్వరూ పట్టించుకోలేదు. పంపు వద్ద ఇద్దరు స్త్రీలు మాట్లాడుతున్న కార్టూన్ చాల బాగుంది. నిజమే ఈ ఆఫీసులు ఉదయం 7.30కి పెట్టిన దగ్గర నుండీ ఇంట్లో ఇల్లాళ్ల యాతన ఇంతా అంతా కాదు. ఇంట్లో పళ్ళు తోము కోవడానికి, స్నానం చెయ్యడానికి వేళ లేక ఆఫీసు పంపు దగ్గర చెయ్యడం. అసలే నీళ్లు చాలవు. ఈ గొడవ కూడానా. చాలా బాగుంది కార్టూన్

వై. లక్ష్మి (విజయవాడ) ●

రైలు పెద్దగా కూత వేసింది. స్టేషను వస్తూ వున్నట్లుంది. నేను దిగవలసినది చిన్న స్టేషను. రైలు ఆగగానే దిగాను. నాతోపాటు మరో ఇద్దరు దిగారు. జట్కా వాళ్లంతా చుట్టూ చేరారు అసలు నాకు మా వూరు వెళ్లాలంటే మంట! స్టేషనుకు రెండు మైళ్ళు వుంటుంది. రోడ్డు మరీ అధ్వాన్నంగా వుంటుంది. కుదుపులో జట్కాలోకంటే నడిచి వెళ్ళటం చాలా నయం. మెల్లగా నడక సాగించాను

పైగా ఇంటికి వెళ్తే పెళ్లి చేసుకోమని అమ్మపోరు. ఆవాళ శనివారం కావటాన 2 గం. లకే పని ముగించుకొని బ్యాంకు నుండి బయటపడ్డాను. బ్రహ్మచారి జీవితం హాయిగానే వుంది. స్వతంభోజనం మఠం నిద్రా! నాది క్యాషియర్ ఉద్యోగమయినా నా బాల్యస్నేహితులు మావూళ్లో నాది కలెక్టరు వుద్యోగమయినట్లు గౌరవిస్తూ వుంటే ఆశ్చర్యంగా ఉంటుంది.

మావూరి పొలిమేరలకుచేరాను. దూరంగా పాడుపడ్డ శివాలయం, ఆ ప్రక్కనే ఆలనా పాలనా లేకుండాపోయిన నంది విగ్రహాలు శిధిలాలు, రావిచెట్టూ కనపడుతున్నాయి. అవన్నీ నా చిన్నతనాన్ని జ్ఞాపకం తెచ్చాయి. అక్కడే నా బాల్యం అంతా గడిపాను— నేను, సుబ్బారావు ఆ రావిచెట్టు దగ్గరే ఆడుకున్నాం. 'బండ సుబ్బడ'ని పెద్దగా అరచి ఆ చెట్టు చాటున దక్కుండే వాడిని నేను. అప్పుడు చూడాలి వాడి పౌరుషం. ఏమిటో! ఆ సుబ్బారావు ఇక్కడే వ్యవసాయం చేస్తున్నాడు. కొంతమంది జీవితాలు అంతేనేమో! గనుగ ఎద్దులాగా! వాళ్లకు కోరికలు, సంపాదిద్దాం అనే తపన, కొత్త కొత్త రుచులూ- అబ్బ ఇవేమీ తెలియదేమో! సుబ్బారావుకి తామూ — తన వ్యవసాయం అంతే! తనకయితే ఒక్కసారి లక్షాధికారి కావాలని అనిపిస్తూ వుంటుంది. కనీసం అటువంటి కోరికలుకూడా వాడికి రావేమో!

ఓ వెల క్రితం సుబ్బారావు తన దగ్గరకు వచ్చాడు. వాడి పొలంలో బావి తవ్విస్తున్నాడట. బ్యాంకులో 'లోన్' అప్లయి చేయడానికి వచ్చి, నన్ను మా ఏజంట్‌తో మాట్లాడి త్వరగా డబ్బు వచ్చేటట్లు చేయమన్నాడు. కాని వాడికి ఏం తెలుస్తుంది నా ఇబ్బందులు. అంతక్రితం రోజే పేకాడుతూ నా ఫ్రెండు ప్రసాదుకు పర్సనల్ లోనూ



వి.యస్.యన్. మూర్తి

ఇప్పిస్తానని ప్రామిస్ చేశాను. ప్రసాదుతో ఇవాళకాకపోతే రేపయినా పని వుంటుంది. 'వస్తానులే' అని చెప్పి సుబ్బారావుని పంపించాను మళ్ళీ ఈ వూరు వస్తే సుబ్బారావే నాకు గతి-తిరగడానికి. అసలు నా పాపం వాడితో నేను ఏ విధంగా మాట్లాడినా నేనంటే తగని అభిమానం. చిన్నప్పటి నుండీ అంతే.

"ఏమోయ్! దారితప్పి వచ్చినట్టున్నావ్!" కరణంగారి కేకకు ఉలిక్కిపడ్డాను. చిరునవ్వునవ్వి వూరుకున్నాను. మాటలు మొదలెడితే ఆపేరకం కాదు ఆయన. ఆలోచిస్తూ నడుస్తూ ఇల్లు చేరాను. నాన్న అరగుమీద కూర్చొని ఎవరితోనో మాట్లాడుతూ, "ఏమోయ్! నీ కుమార రత్నం వచ్చాడు" అని ఓ పొలికేక పెట్టాడు.

మా అమ్మ ఇచ్చిన కాఫీ తాగి ఆవిడ పెళ్ళి సంబంధాలు గొడవ మొదలుపెట్టక పూర్వమే పాడి పాడిగా మాట్లాడి త్వరగా బయట పడ్డాను.

నే వెళ్ళేప్పటికి సుబ్బారావు అప్పుడె వాళ్ళ ఇంట్లోనుంచి బయటకు వస్తున్నాడు. అమాంతం నన్ను కౌగిలించుకున్నాడు. కాఫీ తాగొచ్చానన్నా వినిపించుకోకుండా మళ్ళీ తాగితేగాని వదల్లేదు. ఇద్దరం మెల్లిగా నడుస్తూ రావిచెట్టు దగ్గరకి చేరాము. "ఏమిటిరా? ఇట్లా ఎంతకాలం వుంటావు? పెళ్ళెప్పుడు?" అన్నాడు.

'అబ్బబ్బ' వీడు మొదలు పెట్టాడేమిటి? ఇంటి దగ్గర వాళ్ళను వదిలించుకుని వస్తే' అనుకున్నాను. నా చిరాకును గమనించినట్టు వాడు రాజకీయాలు మొదలు పెట్టాడు. "ఆ మాజీ ప్రెసిడెంటుకూ ఈ కరణానికీ పడదు, ఎప్పుడు కీచులాటే! మొన్నీ మధ్య 'పురావస్తు పరిశోధనా శాఖ' వాళ్ళు వచ్చి త్రవ్వకాలు సాగిస్తున్నారా! వాళ్ళకి ఇక్కడ ఏర్పాటు చేసేది తానే అన్న విషయం పై కొట్టుకున్నంతపని చేశారంటే నమ్ము..." ఏదేదో చెప్పుకొని పోతున్నాడు. అప్పుడు కాని నా దృష్టి ఫర్లాంగు దూరంలో త్రవ్వి పోసిన మట్టి గుట్టలూ, గోతులు మీదిక పోలేదు.

ముందు అక్కడికి వెళ్ళి చూద్దామని ఆ ప్రదేశానికి దారితీశాను. చిన్న చిన్న రాళ్ళా రప్పలతో ఆ ప్రదేశం అంతా నిండి వుంది. సూర్యుడు అప్పుడే అస్తమిస్తున్నాడు. మన దేశంలో అనేకచోట్ల ఈ రకమైన త్రవ్వకాలు సాగిస్తే చరిత్ర గర్భంలో దాగిన అనేక రహస్యాలు బయట పడవచ్చు. చాలా పురాతన కాలంలోనే మన దేశంలో వెల్లి విరిసిన మన నాగరికతను ప్రపంచానికి వెల్లడించవచ్చు నిత్య దారిద్ర్యం తాండవిస్తున్న మనదేశం ఒకప్పుడు రత్నగర్భని చాటవచ్చు.

ఈ ఆలోచనలతో సుబ్బారావు ఏంచేస్తున్నాడో నేను గమనించలేదు. తీరా చప్పుడయ్యేటప్పటికి అటుచూస్తే సుబ్బారావు ఒక గోతిలో దిగి నలుచదరముగా వున్న ఒక రాతి పలకను శక్తి అంతా వుపయోగించి కదిలిస్తున్నాడు. బహుశ ఆరోజుకు అంత వరకూ త్రవ్వినట్టున్నారు. నేనూ వెళ్ళి సుబ్బారావుకు సాయపడ్డాను. అతి కష్టం మీద దాన్ని తొలగించాము. దాని అడుగు భాగాన గుండ్రని ఆకారంలో ఒక కుండ లాటిది వూడ్చినట్టు కనిపించింది. గబ, గబా చుట్టూ వున్న మట్టిని తొలగించి ఆ కుండను బయటకు తీశాము. అది మట్టి కుండైనా బాగా గట్టిగానే వుంది. దాని పైభాగాన పేరుకొని పోయిన మట్టి అదీ దులిపి చూడగా దానినిండా దుమ్ము కొట్టుకొని పోయిన నాణాలు కనపడ్డాయి. ఒక నాణాన్ని తీసి దుమ్ము బాగా దులిపి చూశాము. పసుపు పచ్చగా వుంది. 'బంగారప్పువి కాదు కదా!' నావళ్ళు ఒక్కసారి జలదరించింది! సుబ్బారావు కళ్ళు మెరుస్తూ వుండడం గమనించాను. 'సుబ్బారావుకు సగ భాగం ఇవ్వకుండా సొంతం నేనే తీసుకుంటే'. సుబ్బారావును మస్కా కొట్టడం చాలా తేలిక! అనిపించింది.

"ఒరేస్! వీటిని మనం ఇక్కడ త్రవ్వకాలు చేయిస్తున్న వారికి ఇవ్వటం కంటే పట్నంలోని పెద్ద ఆఫీసర్లకు ఇస్తే మనకు పేరు ప్రతిష్ఠలు వస్తాయి. నేను రేపే వెళ్తాను" నా గొంతు నాకే వికృతంగా వినిపించింది. నేనేనా మాట్లాడుతున్నది? నా మీద నాకే అసహ్యమనిపించింది. "ఇవి బంగారప్పువిలాగ వున్నాయిరా? ఎవరికి తెలుస్తుంది మనకు ఇవిదొరికినట్టు? చెరి సగం తీసుకుంటె పోలేదా?" ఆ క్షణంలో సుబ్బారావు నాకు పెద్ద విలన్‌లాగ కనిపించాడు.

"ఇవి బంగారప్పువైనా ఏదైనా లోహప్పువైనా ప్రభుత్వం వారికి అందజేయటం బాధ్యత కలిగిన పౌరుని కర్తవ్యం. అంతగా అయితే ప్రభుత్వము వారిచ్చే బహుమతినే చెరిసగంతీసుకుందాం? మరేంపోయానా నీకు చెప్పటం. నీ బావికి లోన్ శాంక్షను అయింది. ఒక వారంలో డబ్బు కూడా వస్తుంది" మాట మార్చాను.

'ఈ నాణాలు రెండు మూడు వంద లన్నా వుంటాయి. ఏట్లాలేదన్నా వీటిఖరీదు రెండు మూడు లక్షలు వుంటుంది. ఏం వ్యాపారం పెట్టుకుందాం? అసలు నాకు చిన్నప్పటినుండి వ్యాపారం మీదనే దృష్టి.

## సుదీర్ఘ అంతరిక్ష యాత్ర తర్వాత వ్యోమగాములు

రష్యన్ వ్యోమగాములు వ్లాదిమిర్ ల్యాఖోవ్, వాలెరీ ర్యూమిన్‌లు సుదీర్ఘ కాలం అంతరిక్షంలో గడిపి భూమికి దిగి వచ్చిన పిమ్మట మూడవనాడు భూమి వాతావరణానికి అలవాటు పడడానికి అవసరమైన పనులు చేస్తూ వున్నారు. వ్లాదిమిర్ ల్యాఖోవ్ ఒక హాలులో పది నిమిషాలు పాటు వ్యాయామం చేశారు. వాలెరీ ర్యూమిన్ ఒక పార్కులో కాళ్ళూ చేతులూ కదుపుతూ పది నిమిషాల పాటు నడిచారు.

వ్యోమగాముల కాలి పిక్క కండరాలు బాగా లావెక్కాయని డాక్టర్లు గమనించారు. వారి శారీరక పరిస్థితి కంటె మనో పరిస్థితి భిన్నంగ వుంది. వారు తమ యాత్రా విశేషాలను గురించి అంతరిక్ష అనుభవాల గురించీ ప్రజానీకంలో ముచ్చటించాలని తహతహ లాడుతున్నారు. అంతరిక్షంలో తమకు భావోద్విగ్నత కలిగించిన క్షణాలు తమను అంతరిక్షంలోకి ప్రయోగించటం, రవాణా నౌకల రాక పోకలు, తాము భూమికి దిగడమూనని వ్యోమగాములు చెప్పారు.

## ప్రాప్తం

విధవ ఉద్యోగాలు, ఎంతకాలం సంపాదిస్తే లక్షరూపాయలు వస్తాయి?!' ఆలోచనలు అంతులేకుండా వస్తున్నాయి.

నా ఆలోచనల్లో ప్రపంచాన్ని మరచి సుబ్బారావును గమనించలేదు. వాడిలో పూర్తిగా మార్పు వచ్చింది. పెదాలు బిగుసుకున్నాయి. చేతిక్కిన సిరి జారిపోతున్నప్పుడు కలిగే తెగింపు, ధైర్యము వాడిలో కనపడుతున్నాయి. వాడి ప్రవర్తన నాలో కొద్దిగా భయాన్ని, కలవరపాటును కలిగించింది. సుబ్బారావుకు ఆశ లేదనుకోవటం నా పొరపాటే! ఆ మాటకొస్తే ఆశలేని మానవుడు ఎవరుంటారు?

కనీసం ఇప్పుడైనా వీడిని జాగ్రత్తగా పట్టుకొని రావాలి. వీడికి నాపట్ల అనుమానం రాకుండా పట్నానికి తీసుకొని వెళ్ళి అక్కడ టోకా కొట్టించవచ్చు.

"సుబ్బారావ్! నువ్వు నా మాటలకు బాధపడుతున్నట్లు కనపడుతున్నావే? నిన్ను బాధ పెట్టటానికి కాదు నేను ప్రభుత్వానికి అందచేదామని చెప్పింది. [illegible] కర్తవ్యాన్ని మాత్రమే నేను నీకు గుర్తు చేశాను. అయినా ఈ కాలంలో ఎవరు మాత్రం ఖచ్చితంగా ఉంటున్నారు? అయితే ఒక పనిచేద్దాం. ఈ నాణాలపై ఏ రకమైన లిపి గానీ, చిత్రాలు గానీ లేవు. పైగా అవి కాసు పరిమాణంలో ఉన్నా బంగారము వుండవలసిన బరువు లేవు. ఏదో నాసి లోహంతో చేసిన మిశ్రమ లోహము వలె వుంది! ముందు మనము పట్నం వెళ్ళి, వీటిని పరీక్ష చేయించి, బంగారము అంటే చెరిసగం తీసుకుందాము. చౌకబారు లోహాలు అయితే ప్రభుత్వము వారికి అందచేద్దాము" అన్నాను.

సుబ్బారావు మొహంలో మళ్ళీ కళా కాంతులు చూసి సంతృప్తి పొందాను. మర్నాడు సాయంత్రం బయలుదేరుదామని నిర్ణయించుకున్నాము. నాణాలను సుబ్బారావు పై కండువాలో మూట కట్టాడు జాగ్రత్తగా. కుండని దూరంగా తీసుకొని వెళ్ళి పగలకొట్టాము [illegible] ఎవరికీ అనుమానం రాకుండా. ఆ మూటని నా జీప్ బాసులో పెట్టి మా ఇంట్లో ఇనపెట్టెలో భద్రపరిచాను.

* * *

మర్నాడు రాత్రి మా రూములో నిద్ర పట్టలేదు. ఆరోజు సాయంత్రం బయలుదేరుతుంటే అమ్మ ఒకటే గోల, అప్పుడే వెళ్తున్నా వేమిటి అని. రైలు రెండు గంటలు లేటు. పట్నం చేరేటప్పటికి రాత్రి తొమ్మిది గంటలైంది. భోంచేసుకుని రూము చేరాము. ఏ వ్యాపారం పెట్టుకుందామో ఇంకా నిర్ణయించుకోలేదు. ఈ మధ్య గా బ్యాంకు వాళ్ళు చేపలు పట్టే ట్రాలర్లకు అప్పు ఇచ్చారు. ఉద్యోగంలో చేరక పూర్వమే ట్రాలర్ కొందామంటే సెక్యూరిటీ లేక ఆ ప్రయత్నం మానుకున్నాను. ఇప్పుడు క్యాష్ పెట్టి కొనచ్చు మరచేపోయాను. రేపు ఉదయం మాట ఏమిటి? ముఖ్యంగా శేర్ చమన్‌లాల్‌తో మాట్లాడాలి. శేర్ మా బ్యాంకు కస్టమరు. నవ్వుతూ మాట్లాడు తాడు. పెద్ద బంగారపు కొట్టుంది ఊళ్ళో. స్మగ్లర్ అని పేరు కూడా వుంది. నా వ్యవహారం ముందుగా చెప్పిరావాలి.

సుబ్బారావు అమాయకంగా నిద్రపోతున్నాడు. 'అయినా వాడి సగభాగం వాడికిస్తే నాకు కనీసం ఒక లక్షరూపాయలు వస్తాయి కదా! వాడిని మోసం చేయటం ఎందుకు?' నామీద నాకే కోపం వచ్చింది. 'వాడికి భాగం ఇవ్వకపోతే వచ్చేది రెండు లక్షలు. రెండు లక్షలతో వ్యాపారంచేస్తే పదిలక్షలు రెండు సంవత్సరాల్లో సంపాదిస్తాననే నమ్మకం నాకు వున్నది. అప్పుడు వాడికి రెండు లక్షలు ఇస్తే సరి. వాడి భాగము వాడికి ఇచ్చినట్లే కాకుండా రెట్టింపు ఇచ్చినట్లు అవుతుంది. వాడికా వ్యాపారదక్షత లేదు.' ఆ ఆలోచన రాగానే వాడిని మోసం చేస్తున్నాననే గిల్టీ ఫీలింగు పోయింది. స్నేహితునిగా నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తిస్తున్నట్లు ఆత్మ విశ్వాసం వచ్చింది.

బళ్ళున తెల్లవారింది. కాఫీలు ముగించిన తరువాత మా ఏజెంట్ వద్దకు వెళ్ళి శలవ పెట్టి వస్తానని చెప్పి చమన్‌లాల్‌తో మాట్లాడి వచ్చాను.

సుబ్బారావును రిక్షాను ఊళ్ళోవున్న పెద్ద బంగారపు కొట్టుకు మాట్లాడమని చెప్పాను. నాకు తెలుసు ఆ ఊళ్ళో ఏ రిక్షా వాడయినా చమన్‌లాల్ షాపుకు తీసుకొని వెళ్తాడని. అంతకు ముందు మేమిద్దరం కలిసి మూటలో నుండి తీసికొచ్చిన ఒక నాణెమును చమన్‌లాల్‌కి ఇచ్చి "దీని ఖరీదు కట్టండి సేఠ్" అన్నాడు సుబ్బారావు. చమన్‌లాల్ దాన్ని రకరకాలు పరీక్ష చేశాడు. పలకమీద రాశాడు, యాసిడ్‌వేసి చూశాడు, నొక్కాడు, చివరికి పెదిమ విరిచాడు. సుబ్బారావు వంక తిరిగి "మీకు ఎక్కడ దొరికింది, బాబూ, ఇది. ఇది నమ్మగావుస్తా

బంగారము కాదు దీంటో మాటికి ఒక శాతము మాత్రం బంగారము వుంటుంది. విగతాది చౌకబార్ కే హోలు. దీని ఖరీదు ఐదురూపాయలు వుంటుంది" చమన్‌లాల్ ఆ నాణాన్ని తిరిగి మాకు ఇవ్వలేదన్న సంగతి నేను గ్రహించలేదు. అదే జరిగితే కథ ఇంకొక రకంగా మలుపు తిరిగి వుండేదేమో!

సుబ్బారావు నేను వూహించిన విధంగానే చాలా బాధపడ్డాడు. నన్ను కష్టపెట్టి నందుకు విచారించాడు! వెంటనే రైలుకు వెళ్ళేదని బయలుదేరాడు. భోజనం చేసి వెళ్ళమన్నా వినిపించుకోకుండా. నా పట్టుదలమీద టిఫిన్ చేసి వెళ్ళాడు.

"నువ్వు అందజేయరా ఆ నాణాన్ని ప్రభుత్వము వారికి ఇంకొక వారములో మళ్ళీ వస్తానురా నా బావికి డబ్బు సిద్ధంగా వుంచు!" సుబ్బారావు గొంతు జీరపోయింది బాధతో వాడి భాగమైన లక్షరూపాయలతో వాడి ఆలోచన ఏమిటో! వాడి రైలెక్కించి తిరిగి నేను శేఠ్ షాపుకు వెళ్ళాను.

ఆ రోజు ఉదయాన చమన్‌లాల్‌తో చాలా జాగ్రత్తగా మాట్లాడాను చమన్ లాల్ ఆరితేరిన వ్యాపారస్థుడు అని నాకు బాగా తెలుసు. వాళ్ళా, సుబ్బారావుకు ఆ నాణెము దొరికిందని షాపు తెరవగానే వస్తామనీ, అది బంగారపుది కాదని చెప్ప మనీ అడిగాను. "లంకెబిందెలు దొరికాయా సార్!" అని శేఠ్ అడిగినప్పుడు; అతని కళ్ళ వెనుకగల ఆశను, ఆసక్తిని పూర్తిగా గ్రహించాను అప్పుడే శేఠ్‌కు యదార్థాన్ని చెప్పటం అవివేకమని, ఒక్క నాణెమే దొరికిందని గట్టిగా చెప్పి శేఠ్‌ని నమ్మించాను.

నేను మళ్ళీ తిరిగి చమన్‌లాల్ షాపుకు వెళ్ళినపుడు శేఠ్ ఎవరితోనో ఫోనులో మాట్లాడుతున్నాడు. ఓపిగ్గా కూచు న్నాను. నాణెము విలువ వెయ్యి రూపాయ లయినా ఉంటుందని నేను వూహించాను. శేఠ్ కనీసం తొమ్మిది వందల చొప్పున ఇస్తాడని నా ఆశ. శేఠ్ ఫోనులో మాట్లా డటం పూర్తి చేశాడు. చెప్పల రిక్కించాను ఏం చెప్తాడో అని. "అది నిజంగానే మిశ్రమ లోహమే సార్! నిజంగా దాని విలువ ఐదు రూపాయలే!" తల తిరిగి పోయింది నాకు.

శేఠ్ ఏంమాట్లాడుతున్నాడో వినేస్థితిలో లేను నా వ్యాపారం నా ఆలోచనలు అంతా ఇట్లా పేకమేడలుగా కూలుతుంటే ...

"ఏమిటిసార్! అలా అయిపోతున్నారు బాబూ! కూల్‌డ్రింక్ పట్టుకొని రా! ఏమిసార్! ఇంకా ఏమయినా ఉన్నాయా? అటువంటి నాణాలు?" అప్పుడు ఆ నాణాల విజయం శేఠ్‌కి చెప్పినట్లయితే, శేఠ్ నాకేమయినా సహాయపడి ఉండేవాడేమో! అయినా శేఠ్‌ని నమ్మి ఇంకొకడివద్ద చూపించుకోకపోవడం నేను చేసిన పెద్ద తప్పు కూల్‌డ్రింక్ తాగి రూముకు వచ్చి పడ్డాను.

నాకు పిచ్చి ఎక్కేటట్లు ఉంది, అంతా తలుచుకుంటే! జిప్ బ్యాగు మళ్ళీ తెరచి చూశాను. పచ్చటి నాణాలు వెక్కిరిస్తూ కనపడ్డాయి. నా ఆశంతా నీరైపోయింది. ఇంతలో తలుపు చప్పుడైంది. తీసి చూశాను. సుబ్బారావు ప్రత్యక్షం "వెధవరైలు రోజూ గంట ఆలస్యంగా బయలుదేరేది. ఈరోజు కరెక్టుగా బయలుదేరి వెళ్ళింది. మళ్ళీ సాయంత్రం దాకా... ఏమిటా! అట్లా అయిపోయావు! నాకు ధైర్యంచెప్పి ఏదో బంగారం అనుకున్నాం అవి కాలేదు! ప్రభుత్వానికి ఇచ్చేద్దాం. అసలు అవి మనవి కాదు కదా! మన సొంతంవి పోగొట్టుకొని బాధపడతావేమిటి?" వాడి అమాయకత్వా నికి నాకు జాలి వేసింది. నన్ను పూర్తిగా నమ్మాడు. సరేకానీ, నాయ్యంగా అవి వీడివి. వీడిచేతనే ప్రభుత్వానికి అవి ఇప్పిస్తే వీడికు కొంచమైనా తృప్తి. ఏదైనా బహుమతి ఇస్తే అది వీడికే దక్కాలి. స్నేహభావం నాలో పరవళ్ళు తొక్కుతూంది.

సుబ్బారావును వెంట తీసుకొని సరాసరి ఆర్కియాలజీ డిపార్టుమెంటు డైరెక్టరు వద్దకు వెళ్ళి, అన్నీ వివరించి సుబ్బారావుకు ఏవిధంగా ఆ నాణాలు దొరికాయో చెప్పాను.

ఆయన 'ఒక్క నిమిషం' అంటూ ఒక నాణాన్ని తీసుకొని, వారి అసిస్టెంటును పిలిచి నాణాన్ని రసాయనిక పరీక్ష చేయమని ఆదేశించారు

ఆ నాణాలను తీసుకొని వచ్చి ప్రభు త్వానికి అందచేసినందుకు సభ్యునిగా సుబ్బారావును ఆయన ఎంతో కొనియా డారు

"గోల్డు సార్! ప్యూర్ గోల్డు!" అసి స్టెంటు తీసుకొనివచ్చి నాణాన్ని టేబుల్ మీద వుంచాడు.

నా కాళ్ళు, చేతులు చల్లబడ్డాయి. డైరెక్టరుగారి పొగడ్తలు నా చెవికి ఎక్క లేదు సుబ్బారావు సన్మానం తరు వాత ఏర్పాటు చేసిన సన్మాన సభలో సుబ్బా రావుకు పదివేల రూపాయల చెక్ అంద జేసినా నేను బాధపడలేదు. అయ్యను! అది దక్కవలసిన వాడికే దక్కింది అన్న సంతృప్తి నా హృదయాన్ని ఆవరించింది.



# హైదరాబాద్ నోట్ బుక్

—తిరుమల రామచంద్ర

**మాట్లాడే మల్లెలు :**

ఇంకా ఇంకా
ఎన్నెన్నో ఇలాంటి మల్లెలు !
పాపం! ఇవన్నీ
ఈ పుణ్య భూమిలోనే పుట్టినవి
ఈ ఎండల్లోనే పూచేవి
పాపం! ఇవన్నీ
పాలకు తీరంలా ఉండవలసినవి
పవిత్రతకు దివ్వెలై వెలుగవలసినవి
కానీ, అలా లేదే!
ఈ మల్లెల మనసులో మాటలతో
జాతి గీతం అల్లేవాడు లేడే !
ఇంక వసంత కాంతి ఏమిటి ?
విశ్రాంత ప్రశాంతి ఏమిటి?

అని ప్రశ్నించారు ఆచార్య తిరుమల 'మాట్లాడే మల్లెలు' కావ్యంలో. అవును. ఎన్నో మల్లెలు అరణ్య కుసుమాలవుతాయి. ఎవరి ఆదరణా లేక రాలి పోతాయి. సహృదయులందరికీ వ్యర్థమై పోతున్న దేశ యువతను చూసి ఆవేదన పడే వారందరికీ ఆచార్య తిరుమల ప్రశ్న ఉదయిస్తుంది. ముప్పయి రెండు ఖండికలున్న ఈ 'మాట్లాడే మల్లెలు' ఆవిష్కరణ ఉత్సవం ఆగస్టు 22 వ తేదీన చిక్కడ పల్లిలోని నగర కేంద్ర గ్రంథాలయంలో జరిగింది. డాక్టర్ పి. నారాయణరెడ్డి ఆవిష్కరించారు. ఆవిష్కరణోత్సవానికి ఆంధ్ర బ్యాంకి పౌర సంబంధాధికారి శ్రీ కె. వి. భాస్కర రావు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు ఎల్లోరా, రాజారావు, కపిల లక్ష్మణరావు, శ్రీమతి శారదా అశోక వర్ధన్ కవితా సంకలనాన్ని పరామర్శించారు. కృతిని అంకితం తీసుకున్న శ్రీ రావులపాటి కృష్ణారావు దుశ్శాలువలతో కవిని సత్కరించారు. ఆచార్య తిరుమల సమాధానం చెప్పిన మీదట శ్రీ వంశీ రామశర్మ వందన సమర్పణ తెలిపారు. ఈ ఆవిష్కరణోత్సవాన్ని వంశీ ఆర్ట్స్ థియేటర్ వారు ఏర్పాటు చేశారు.

**వినాయక విగ్రహాలు :**

ఏటా కడు వైభవంతో జరిగే వినాయక చవితి ఉత్సవం ఈ ఏడు మరింత సంబరంతో జరిగింది. విగ్రహాల నిర్మాణంలో పోటీలు పడ్డట్లుగా జంట నగరాలలోని పలు ప్రాంతాలలో వినాయక విగ్రహాలు వెలిశాయి. భారీ విగ్రహాలు వందల సంఖ్యలో కనిపించాయి. ఒక్క మహారాజగంజిలోనే నిలువెత్తు విగ్రహాలు 200 లకు పైగా కనిపించాయి. ఆయా ప్రాంతాల విధాన సభ సభ్యులు, మంత్రులు వినాయక పూజలకు ప్రారంభోత్సవం చేశారు. పీల్ ఖానా వినాయక నగర్‌లోని విగ్రహం, సికిందరాబాద్ వై. ఎం. సి. ఏ సమీపంలోని కంటోన్మెంటు పార్కులోని విగ్రహం చాల పెద్దవి పదిహేను అడుగుల ఎత్తు. పీల్ ఖానా లోని విగ్రహం శివ పూజ చేస్తున్నట్లుగా సిద్ధపరచారు. దీనిని శ్రీయుతులు శీతల్‌సింగ్, నర్సింగ్‌రావు అనేవారు రెండు నెలలపాటు చేశారట. దీనిని ఆర్యన్ స్పోర్ట్స్ క్లబ్ వారు ప్రతిష్ఠించారు. సికిందరాబాద్ విగ్రహాన్ని ఆదర్శ లారీ యజమానుల సంఘం తయారు చేయించింది. దీనిని ధ్రువ్‌సింగ్‌హజారీ అనే వారు నాలుగు నెలలలో తయారు చేశారు. పీల్ ఖానా పంచాయతీ వాడలోని నటన వినాయక విగ్రహం ఎత్తు పద్నాలుగున్నర అడుగులు. ఖైరతాబాద్ గ్రంథాలయం ముందు ప్రతిష్ఠించిన విగ్రహం ఎత్తు పదమూడడుగులు. ఈ ఉత్సవాన్ని చూస్తున్నంత సేపు భారత దేశ సమైక్యానికిలాంటి పండుగలు, పబ్బాలు ఎంత గొప్ప సేవ చేస్తున్నవి గదా అని ఆనందం కలుగుతుంది ఎవరికైనా. ఈ సమైక్య భావన బలపడడానికి కులంబేడద పోవాలి. కొన్ని ప్రాచీన సంస్కృతుల లోను వృత్తులతో ఏర్పడిన కుల వ్యవస్థ వుండేది. కాని ప్రజలవివేకం తోను, కాల ప్రభావ ప్రవాహంతోను అది అంతరించి పోయింది. భారత దేశంలో మాత్రం ఈ వ్యవస్థ ఇంకా వుంది. కాని పునాదులు సడలి గోడలు బీటలు వారినవి. కూలి పోక తప్పదు.



అంతర్జాతీయ బాలల సంవత్సరం సందర్భంగా భువనేశ్వర్‌లోని "రినయసెన్స్ గ్రూపు" (బెంగాలీ సమితి) వారు నిర్వహించిన సంయుక్త భాషా నాటక. నాటిక. నృత్య పోటీలలో "కళాభారతి" సమితి తరపున చిరంజీవి కె. వి. లక్ష్మి (9) కి ప్రత్యేకబహుమతి నంద జేస్తున్న ఒరిస్సా విద్యామంత్రి శ్రీ ప్రదీప్త కిశోర్ దాస్‌ని చిత్రంలో చూడవచ్చు. ఒరిస్సా ముఖ్యమంత్రి శ్రీ నీలమణి రౌత్రాయి ఈ సమావేశానికి ముఖ్యఅతిథిగా విచ్చేశారు.

**ఉపశ్రుతి :**

నల్లబజారు వ్యాపారం అనాదిగా వున్నట్టుందండీ అన్నారు ఒకరు, ఒక గోష్ఠిలో. అవును. శ్రీమన్నారాయణుడే దీనికి అధిష్ఠాన దేవత అన్నారు మిత్రులు డాక్టర్ ముకురాల రామరెడ్డి. ఎట్లాగండీ అని కొంచెం ఉద్రేకంతో ప్రశ్నించాడు ఒక విష్ణు భక్తుడు. శ్రీమన్నారాయణుడు శ్రీభూనీలా సమేతుడు గదా. శ్రీ అనేది కాపిటలిస్టు తత్వానికి, భూ అనేది భూస్వామ్య వ్యవస్థకు చిహ్నం. నీలా అనేది బ్లాక్ మార్కెటుకు చిహ్నం కాదంటారా? అని డాక్టర్ రెడ్డి వివరించేసరికి అందరూ గొల్లుమన్నారు. ●



# ఛాంపియన్ డిటర్జంట్ కేక్ !

# 1 అప్

మరింత
తెల్లదనంతో
మీకు
విజయం!

మీకు
డబ్బులో
మరింత
ఆదా!



అధిక తీవ్రంగా పని
చేసే నురుగ, అధికంగా
తెలుపుచేసే పదార్థాలతో
శక్తి, దాంతోపే శుభ్రతతో
పాటు తెల్లదనాన్ని
యిస్తుంది మీకు వన్-అప్.
దాంతో తెల్లవాటికి మరింత
తెలుపు, రంగువాటికి
మరింత మెరుపూ వస్తుంది.






వన్-అప్, మరే యితర
డిటర్జంట్ కేక్ కన్నా
ఎక్కువకాలం మన్ను
తుంది. ఎందుకంటే,
వాడగానే తొందరగా అరి
పోతుంది గనక. అంటే
ఉతికే ప్రతిసారీ మీరు
డబ్బును ఆదా
చేస్తున్నారన్నమాటే!




తెల్లదనానికి మీ పాలిట ఛాంపియన్!

ASP/WL-1UP 2R

విట్కో లిమిటెడ్, కాలోల్ 389 330 గుజరాత్.










# వారఫలం

## 28-9-1979 శుక్రవారం మొదలు
## 4-10-1979 గురువారం వరకు

**మేషం :-** ఆదాయ వ్యయాలు సమపాళ్ళలో ఉంటాయి. రాశినుండి పంచమస్థానంలో స్థితులైన గ్రహాలవల్ల భిన్న మార్గాలలో మంచి చెడుగులకు సంబంధించిన ఫలితాలను పొందగలరు. ఆదాయం సామాన్యం. అధికారం చెలాయించవలసి ఉంటుంది. గౌరవానికి లోపంలేదు. ఉత్తమఫలం ఆశించరాదు. స్త్రీలకు : సుఖసంతోషాలుంటాయి. గృహ సౌఖ్యం, స్వల్పాదాయానికి గ్రహబలానుకూలత గలదు. శుక్రవారం ఉత్తమఫల ప్రాప్తి.

**వృషభం :** ఆరోగ్య విషయంలో హెచ్చరిక. గ్రహ జపం. అవుషధసేవ అవసరం. అనవసరమైన కార్యాల జోలికి పోరాదు. నిగ్రహం కావలసిన వారం. ఉద్రేక కార్యాల జోలికి పోరాదు. ఆదాయం, ఆదరణ, అంతంత మాత్రమే. స్త్రీలకు :— ఏ విధంగా లోటు కనిపించదు. మాటకు మన్నన, గౌరవం సంభవం. శనివారం లాభదాయకమైన దినం.

**మిధునం:—** ఉత్తమఫల ప్రదాయకమైన గ్రహాను కూలత కలదు. ఆరోగ్యలోపం కూడా కన్పించదు. సాహిత్య కళారంగానుభవం గల వారికి అనుభవయోగ్యమైన ఫలప్రాప్తి కలదు. పెద్దల సాంగత్యం, మిత్ర సహాయం లభించే అవకాశం గలదు. పుణ్యకార్యాలు నెరవేరే గ్రహ సూచనగలదు. ద్రవ్యాదాయమున్నది. శనివారం మంచిదినమని భావించి యత్నించి పనులను సానుకూలం చేసికొనండి. స్త్రీలకు :— ఉత్తమఫల ప్రాప్తిగల వారం.

**కర్కాటకం:—** గురుగ్రహ చలనం, యితరగ్రహాను కూలత వలన అన్నిరంగాల్లో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ద్రవ్యాదాయమున్నది. రావలసిన బాకీలు వసూలయ్యే సూచన కలదు. వ్యాపార విస్తరణకు అనుకూల దినాలు. ఆరోగ్య విషయంలో శ్రద్ధ వహించటం ఎంతైనా అవసరం. చాలాకాలంగా ఎదురు చూచే ఉత్తరం సమయానికి అందింది, సంతోషదాయకంగా వారం గడుస్తుంది. స్త్రీలకు :— గృహసౌఖ్యం, ఆదాయాభివృద్ధి, గౌరవం సంభవం.

**సింహం:—** మీరాశిలో చాలా గ్రహాలు కూడటంతో, శుభాశుభ మిశ్రమ ఫలాలుంటాయి. ముందుకెళ్ళటం, వెనుకకు తగ్గటం ప్రారంభమవుతుంది. చాలమందికి, ముఖ్యంగా వయసు మళ్ళిన స్త్రీ పురుషులకు, ఆరోగ్యలోపం కనిపిస్తుంది. రావలసిన ద్రవ్యంకూడ చేతికి రాదు. చాలమందికి వస్తువాహనాలు అమ్మటం కూడా జరుగుతుంది. స్త్రీలకు :— ఆందోళనకరమైన వారమే.

**కన్య:—** పూజాపురస్కారాలతో వారం గడవటం క్షేమం. పెద్దగా లాభాలు గడించాలని ప్రయత్నించటం అంతమంచిపనిగాదు. ఆశ్రితులను, బంధువర్గీయులను, ఆత్మీయులను తృప్తిపరచటం సామాన్యమైన పనిగాదు. రాబడి చాలకపోవటం గ్రహిస్తారు. స్త్రీలకు :— ఆరోగ్యలోపం కన్పిస్తుంది. ఆదాయం కూడ చాలని వారమే.

**తుల:—** లాభం సమకూడే వారం. బంధువర్గీయులతో ముచ్చట్లతో కాలక్షేపం సమకూడుతుంది. అందంకోసం, ఆనందం కోసం తాపత్రయపడటం గమనించగలరు. వ్యాపార విస్తరణకు అనుకూలమైన వారం. ఉద్యోగంలో, ఉత్తమస్థాయినందుకొనుట గమనింపగలరు. మీకు కావలసిన బంధువులో, మిత్రులో, మీ సహాయమర్థించటంకూడా సంభవం. ఆలోచించి అడుగు ముందుకు పెట్టుట జ్యోతిష శాస్త్రము యొక్క హెచ్చరిక.

**వృశ్చికం:-** ఆరోగ్యం చక్కగా చూచుకోండి. లోపాన్ని సరిదిద్దుకొన ప్రయత్నించండి. మీ సహచరులే, మిమ్ము మోసగించబోతారని గ్రహించి, జాగ్రత్తగా మసులుకోండి. భూసంబంధమైన తగాదాలు తలఎత్తవచ్చు. గౌరవానికి భంగం రాకుండా చూచుకోవటం, ఆడినమాటకు భంగం రాకుండా చూచుకోటం ఎంతైనా అవసరం. స్త్రీలకు : చాలమందికి, గౌరవప్రదమైన పదవులు సంప్రాప్తింపవచ్చు. ఆరోగ్యలోపం రాదు.

**ధనుస్సు:** ఎదురుచూచిన ఆదాయం, సమయానికి అందుతుంది. చాలమందికి సంతోషదాయకమైన వారంగా ఉంటుంది. వ్యాపారంలో అధిక లాభార్జనకు అవకాశమున్నది. ఉద్యోగంలో హోదాపెరుగుతుంది. తలచిన పనులు తలంచినట్లు నెరవేరుతాయి. స్త్రీలకు : క్రొత్త అవకాశాలు చేజిక్కటం, తద్వారా ద్రవ్యాదాయం సమకూడుట గమనించగలరు.

**మకరం:—** మాట కాపాడుకొనుటకు సర్వవిధాలా ప్రయత్నిస్తారు. సంపాదనకు మించిన వ్యయం, అందుకు తోడు లాభదాయకమైన పనులలోనే, నష్టం రావటం, మానసికంగా చికాకు కలుగుతుంది. వేదనతో, కష్టంతో, వారం గడచిపోతుంది. స్త్రీలకు : ఏవిధంగా చూచినా, లాభంగాని, ఆదాయంగాని, అభివృద్ధిగాని చెప్పవీలులేదు.

**కుంభం:—** శిల్ప, పత్రికానుభవం గల వారికి, గ్రంథవిక్రేతలకు, పత్రికా వ్యాపారస్థులకు, యోగ్యమైన వారం. ప్రయత్నించి, లాభం గడించి, ఆనందించతగిన వారం. చిరకాలమిత్ర సందర్శనం, కబుర్లతో కాలక్షేపం చేయడం ఒక ప్రత్యేక లక్షణం. రాశివారికి చాలమందికి ఆరోగ్యలోపం కనిపిస్తుంది. స్త్రీలకు : సర్వవిధాలా మేలైన రోజులు. శనివారం యోగప్రదం.

**మీనం:—** ముఖ్యమైన కార్యక్రమం వాయిదా వేయటం ఎంతైనా మేలు. గ్రహబలం లేనివారం. వారఫలం అనుకూలంగాలేదు. ఎవరో, మేలుచేయబోతారనుకొనుట తగదు. యథాప్రకారం మామూలుగా పనిచేసి, కార్యాలను సాధించుకొనండి. స్త్రీలకు : ఆరోగ్యం సామాన్యం. ఆదాయం సామాన్యమే.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి




# రికొరి®
# ఇన్‌స్టెంట్









*ఇది ఫిల్టర్*
*కాఫీ వలెనే యెంతో*
*రుచిగా ఉంటుంది కాబట్టి*
*తేడాచెప్పడం చాలాకష్టం.*

'నెస కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్ఠత తెలిసినవారు

SAA/FSL/R/1135






**మరొకసారి!**
1978లో జెనీవాలో
జరిగిన మోండే
పోటీలో కిసాన్
ఆరెంజ్ స్క్వాష్
బంగారు పతకాన్ని
గెలుచుకుంది




కిసాన్ స్క్వాష్ శీతలపానీయం గొంతును తడిపిన క్షణం ఒక ఆహ్లాదకరమైన క్షణం.

మీకు ఇష్టమైన పళ్లరసం-కిసాన్, నారింజ, నిమ్మ, మామిడి రసాలతో మధురానుభూతిని పొందండి

వివిధకాలాలో లభించే ఫలాలే వాటిరసాన్ని కిసాన్ స్క్వాష్‌లు క్రష్‌లకు ఇస్తాయి. చిక్కని మిశ్రమంగా రూపొందే కిసాన్ స్క్వాష్‌లు, క్రష్‌లలో వేరే తియ్యని పదార్థాలు కలపనవసరం లేదు. ఇది నీరు, సోడాలలో ఇట్టే కరిగిపోతుంది. అందుచేత అనుకోని అతిథుల కోసం, మీ దాహం తీర్చడంకోసం ఒక సీసా ఎల్లప్పుడు సిద్ధంగా ఉంచుకోండి.

ఒకే ధరకల 20 ఎమ్ ఎల్‌ల స్క్వాష్‌లు, క్రష్‌ల పెద్ద సీసాలు ఇప్పుడు లభిస్తున్నాయి.

కిసాన్ రకాలు

స్క్వాష్‌లు :- నిమ్మ, నారింజ, మామిడి, లైమ్‌జ్యూస్ కార్డియల్, లెమన్–బార్లీవాటర్

క్రష్‌లు :- ద్రాక్ష, పైనాపిల్, నారింజ




**Kissan Products Limited**
Post Box No 1676
Old Madras Road, Bangalore-560 016

maa KPL 19 tel a-79

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

బి. వి. ఆర్ ఎస్. — నెల్లూరు

దేవుని విగ్రహాలన్నీ ప్రజలకు అభయహస్తం చూపిస్తున్నట్టు వుంటాయి. కాని వెంకటేశ్వర స్వామి చేతులు మాత్రం ఒకచెయ్యి కిందకు, ఒకచెయ్యి ప్రక్కకు ఉంటుంది. ఎందువలన? నా సందేహం తీరుస్తారా? చెత్త బుట్టలో వేస్తారా?

ఆగమ శాస్త్రానుసారం విగ్రహ నిర్మాణం జరుగుతుంది గాని అన్ని విగ్రహాలు ఒకేలా వుండవు. కేశవా, నారాయణా, గోవిందా మొదలైన ఇరవై నాలుగు విగ్రహాల్లో కూడా ఏ ఒక్కటి ఇంకొక దాన్ని పోలివుండదు. వాటి హస్తాలలో ఆయుధాలు కూడా వివిధ రకాలుగా వుంటాయి. ఆయుధం లేని హస్తాలు వెంకటేశ్వరస్వామివి పైకుండేవి అభయహస్తం అయితే, కిందవుండేవి వరద హస్తం అంటారు. ఆరూపాలూ, సూక్ష్మాలూ అధ్యయనం చేసిన వాళ్లని అడిగి తెలుసుకోవాలి.

జి. ఎస్ ఎస్. బెల్లి

దాన ధర్మాలు చేయడం వల్ల ముక్తి లభించుతుంది అందురు కొని వారే— ఏ ధర్మము, ఇతరులకు సహాయం ఉపకారము చేయరు. పరోక్షంగా అపకారం కూడా తలపెడతారు

అలాంటి పెద్దలకి నా నమస్కారం పెట్టివూరుకోవాలి. అలాంటి వారి చేతినుంచి ఏదైనా స్వీకరించడం కూడా ముక్తికి మార్గం మూసివేసుకోవడమే అవుతుంది.

యు యు ఉరుమందు (ఎమ్మిగనూరు)

ఈ మధ్య ప్రశ్నావళి శీర్షిక పత్రికలో కనబడ లేదు. ఈ సారి మనుమరాలేమైనా పుట్టిందా అక్కగారూ. అప్పుడప్పుడిలా ఎగ్గొడితే మాకు ఎంత బాధగా వుంటుందో తెలుసా ?

భలే వాడివి తమ్ముడూ ప్రశ్నావళి కనపడకపోతే సడన్‌గా పంటి పలువు తీసేసినట్టుందని సంబరపడి పోయారు చాలామంది!. మనవరాలు పుట్ట లేదు గాని అలా సరదాగా ఆస్పత్రిలో ఉండొచ్చాను ! మొండి ఘటాన్ని. అప్పుడే వదులుతానా? మీ పిచ్చిగాని.

ఎస్. వి. హైదరాబాదు

రాజకీయంగా రైటైనప్పుడు నైతికంగా కూడా ప్రజానీకానికి రైటే కదా రాజనారాయణ్‌ని, చరణ్ సింగ్‌ని ఆడిపోసుకోడంలో అర్థం లేదనిపిస్తుంది మీ రేమంటారు

చాలా పొరపాటు అంటాను నైతికంగా తప్పు అయినది ఎప్పటికీ రాజకీయంగా రైటు కానే కాదు. వ్యక్తులకి నైతిక విలువ లేకపోవడమే కద ఈ రాజకీయ సంక్షోభానికి నాంది

ఏ. ఆర్ ఎల్ రాయదుర్గం

మగవారి కపట నాటకాలను మధురంగా మోసపోయే స్త్రీ జీవిత విలువలు మారేదెప్పుడు

ఆడది ఆర్థికంగా ఎవరిమీదా ఆధారపడకుండా వుండగల్గడం, కాళ్ళ నేల మీదా వూహాలుమాత్రమే గాల్లో తేలనివ్వడం హృదయం కంటే మెదడు షార్ప్‌గా పని చేయడం ప్రారంభిస్తే ఆడదాని విలువ అదే మారుతుంది







సీరియల్

# నళిని

## చిట్టారెడ్డి సూర్యకుమారి

*(గత సంచిక తరువాయి)*

**జరిగిన కథ-10** : తమ కాలేజీ చదువు ముగించుకొని బయటపడ్డారు వాసవి, నళినీలు తరువాత వాసవితో కలిసి వాళ్లవూరు వెళ్తుంది నళిని అక్కడి ఆహ్లాదకరమైన గ్రామీణ వాతావరణానికి పరవశించిపోతుంది. కొన్నాళ్ళకు ఆ వాతావరణం విసుగుపుట్టగా, బావ మోహన్‌తో కలిసి వాసవి, నళినీలు లేపాక్షి వెళ్ళి అక్కడి సుందరమైన శిల్పములను, వాటి చరిత్రను తెలుసుకొంటారు అక్కడినుండి హైదరాబాద్‌లోని తనవాళ్ళ దగ్గరకు వెళ్తుండగా, రైల్వేస్టేషన్‌లో పరిచయమైన కెప్టెన్ అజయ్, తనని ప్రేమిస్తున్నానని చెప్పగా ఆశ్చర్యపోతుంది నళిని తన తండ్రి మరణించగా, నళిని యిచ్చిన టెలిగ్రామ్‌ను అందుకొని అక్కడకు చేరుతుంది వాసవి అజయ్ తన తల్లిదండ్రులకు వాసవి, నళినీలను పరిచయం చేస్తాడు వాళ్ళ దగ్గర శలవు తీసుకొని అక్కగారి పిల్లలతో కలసి హకీమ్‌పేట్ ఏర్‌ఫోర్స్ స్టేషన్‌కి వెళ్ళి, అక్కడివన్నీ చూసి, అక్క రాజకుమారి, బావ రావుగార్లతో మెస్‌లో పార్టీకి వెళ్తారు వాసవి, నళినీలు కొన్నాళ్లకు వాళ్ళు యూనివర్సిటీలో చేరగా, అజయ్ వచ్చి నళినీని తీసుకుపోతాడు. అనుకోకుండా 'జూలాజికల్ రెస్ట్‌హౌస్'లో అజయ్, నళినీలు ఏకశరీరులైపోతారు భరత్, పాకిస్తాన్‌ల మధ్య జరుగుతున్న యుద్ధంలో అజయ్, రావులు పాల్గొంటారు

భారత – పాకిస్తానీల యుద్ధం పదునాలుగు రోజులు జరిగింది. ఆ పోరాటంలో భారత సైనికులు వీరోచితంగా పోరాడి, పాకిస్తాన్‌లోకి చొచ్చుకొనిపోయి వారి ఆట కట్టించారు.

కొత్త ఢిల్లీ విజయ చౌక్ దగ్గర, రంగు రంగుల జండాలు విజయబావుటాల్లా ఉరవడిలేని గాలిలో ఉల్లాసంగా ఎగురుతున్నాయి 'రిపబ్లిక్ డే' సంబరాల్లో దేశం మునిగిపోయింది యుద్ధంలో పాల్గొని చూపించిన సమయస్ఫూర్తికి, ధైర్య సాహసాలకి గుర్తింపుగా వీరులను ప్రత్యేకించి గౌరవిస్తూ, బిరుదులను ఇస్తూ, బహుమతులను పంచిపెట్టుతూ కృతజ్ఞతను చూపెట్టింది ప్రభుత్వం

మేజర్ హోషియార్‌సింగ్ పరమ వీరచక్ర తీసుకున్నాడు ఇద్దరు కొడుకుల మధ్య కూర్చున్న అతని భార్య భర్తను చూసి పుప్పొంగిపోతూ ఆనందభాష్పాలను రాల్చింది తన జీవితం ధన్యమైనట్లు భావించింది

లెఫ్టినెంట్ ప్రేమకుమార్‌ఖన్నా మహవీర చక్రాన్ని పొందాడు మరి కొందరు వీరచక్రాలను స్వీకరించారు

ఆ ఆనందంలో ఈ బహుమతి ప్రదానంలో భాగం పంచుకునే తోటి సోదరులు లేరే అని బాధపడుతూనే వున్నారు మైకులో స్క్వాడ్రన్ లీడర్ రావుగారి పేరు మారుమ్రోగింది 'చిల్లీరావు తన పేరును సార్థకం చేసుకున్నారు తన విమానానికి శత్రువుల బాంబులు వచ్చి మూడుసార్లు తగిలినా — ఒకప్రక్క విమానం కాలిపోతున్నా చివరిక్షణం వరకు శత్రు విమానాలను ముఖాముఖిగా ఎదుర్కొని శత్రు విమానాలను కూల్చి వీరస్వర్గం చేరుకున్నారు' అని క్లుప్తంగా చెప్పినప్పుడు సదస్సులు కన్నీరు కార్చారు.

మన విజయానికి ఒక కన్ను సంతోషిస్తూ వుంటే, మరో కన్ను ఏడుస్తూ వుంది.

భర్త బహుమతి పరమ వీరచక్రను అందుకో వానికి వచ్చే మిసెస్ రావు కొరకు అందరి కళ్ళు వేచివున్నాయి

పూలు దుస్తుల్లో ముద్దుగా ఠీవిగా వస్తున్న ఏది సంవత్సరాల పవిత్రను చూసి సభికుల గుండెలు దుఃఖంతో గుబగుబలాడాయి

పవిత్రలో రావుగారిని చూస్తూ శిలాప్రతిమలా కూర్చుండిపోయింది నళిని ప్రక్కనున్న అన్న కదలి కదలి ఏడుస్తున్నాడు, చెల్లెలు రాజకుమారిని తలచుకుంటూ.

'రావు ఇక లేడు' అన్న వార్త విని నేలకంటుకు పోయింది. దుఃఖ సముద్రములో మునిగిపోయింది

శోకాగ్నిలో కాలిపోతున్న రాజకుమారిని బయటికిలాగను ఎవ్వరి వశం కాలేదు ఢిల్లీకి తీసుకురాలేకపోయారు

తండ్రి బహుమతి కొడుకు అందుకున్నాడు అపూర్వ దృశ్యం చూసి జయ జయ నాదాలు దుందుభుల్లా మ్రోగాయి

తర్వాత కెప్టెన్ నాథ్ పేరు ప్రకటించారు ఊషర్‌వాల్ దగ్గర మద్రాసు రెజిమెంటు ముందుకు పోతూంది ముందున్న లెఫ్టినెంట్ కర్నల్ గాయ్‌కి తూటా వచ్చి తగిలింది. వెంటనే దగ్గరున్న డాక్టర్ నాథ్ అతనికి చికిత్స మొదలు పెట్టాడు బిజీగా తన పనిలో నిమగ్నమైవున్న డాక్టరికి మరో తూటా వచ్చి డాక్టరు ప్రాణాలను తీసింది

డాక్టరు సతీమణి వీరచక్రను ఏడుస్తూ తీసుకుంది చూపరుల హృదయాలు బరువెక్కి పోయాయి

నళిని చూపు నిశ్చలంగా వుంది కాప్టన్ అజయ్ పేరు విన్న నళిని నరాలు 'అజయ్. అజయ్, అజయ్' అంటూ కదలిపోయాయి శ్రవణేంద్రియాలు పనిచేయటం మానివేశాయి

గుంపులో నుంచి తడబడే అడుగులతో మెల్లగా మెల్లగా నడుస్తూ అజయ్ తల్లి పోతూంది వీరమాత. వాలిపోతున్న తలను గర్వంగా పైకెత్తి నిలబెట్టటానికి ప్రయత్నిస్తూవుంది ఉన్న ఒక్కకొడుకును పోగొట్టుకున్న ఆ తల్లి ఆర్తరూపాన్ని చూస్తున్నారు

వృద్ధ శిథిలమైన జీవితాలు ఎవ్వరికి కావాలి? ఏం చూసుకొని బ్రతకాలి? తన భార్య అయినా దక్కుతుందా! భగవాన్! ఆ తల్లి హృదయం ఏ క్షణాన ఆగిపోతుందో? మంచు ముద్దలా కూర్చున్నారు శంకర్‌గారు

''అజయ్! అజయ్! నేనున్నాను కాని నాకు అదృష్టంలేదు అజయ్ చూస్తున్నావా? నేను నీదానను, కాని లోకం దృష్టిలో మనిద్దరం ఏమి కాము నేను నీకేమికాను నేను కన్యనే అవివాహితను! ఇదేనా నీవు కోరుకుంది? నా భవిష్యత్తు గురించి ఆలోచించావు నీవు లేని భవిష్యత్తు నాకు వద్దు అజయ్ అ. జయ్ '' నళిని హృదయం ఆక్రోశించసాగింది.

ఈ దుఃఖానికి అంతు అంటూ వుందా? చుట్టూ అంతు తెలియని చీకటి తనను కప్పేస్తుంటే, బాహ్యప్రపంచాన్ని గుర్తించటం మర్చిపోయింది అక్కడ ఏం జరుగుతుందో తెలుసుకోలేక వుంది

ఇంకేమి మిగిలింది?

భర్తలను పోగొట్టుకున్న ఆ విధవరాండ్రకు ఆ కాస్సేపు ఎంతో గౌరవం

కేకలువేస్తూ జేజేలు కొట్టుతూ వాళ్ళని అభినందిస్తూవుంటే ఆ సంతోషంలో ఆ క్షణంలో భర్త తెచ్చిన ప్రతిష్టలో ఇంద్రధనుస్సు నెక్కినంతగా భ్రమలో పడ్డారు ఆ భ్రమ మబ్బుల్లా తేలిపోయింది జెండాలు దిగిపోయాయి డ్రిమ్స్ ఆగిపోయాయి అభిమానం చూపించిన ఆ జనం వెళ్ళిపోయారు

ముందు కనిపిస్తున్న విశాల ప్రపంచంలో చోటుకొరకు వెతికాయి వారి కన్నులు కొందరికి తిరిగిపోవటానికి ఇండ్లు లేవు నీడ లేదు ఎవ్వరు వుంచుకుంటారు! ప్రొద్దున్నే విధవరాలి ముఖం చూడ్డానికి ఎవ్వరికిష్టం వుంటుంది!

బంధువులు, మిత్రులు ఆదరిస్తారా? అలలు దిద్దుతున్న తన పిల్లల గతి ఏంటి!

కోడలి రాత తక్కువై తన కొడుకు చనిపోయాడని అత్తలు అప్పుడే పోరుపెట్టిన ఆడపడచుల ఆక్రందనలు ఏ యుద్ధం వింటుంది? మరింకే యుద్ధంచేస్తే వారి కన్నీరు ఆగి వారి కష్టం తీరుతుంది?

వారి బ్రతుకులే శూన్యమైపోయినవి

* * *

నళినీ, వాసవీలు సంతప్తులు, సంబ్రాంతి చిత్తులు అయినారు శోకవహ్నిలో వున్న నళిని తల చెదరి, దుస్తులు నలిగి వుంటున్నాయి ఏమి వింటున్నదో, ఏమి కట్టుతున్నదో తెలియని స్థితి తనది

రాజకుమారి దుఃఖంతో పిచ్చిదైపోయింది అది దీనావస్థో లేక పిచ్చిపట్టిందో తెలుసుకోటానికి కూతుర్ని వెంటబెట్టుకొని ఆస్పత్రుల వెంట తిరుగుతూ వృద్ధాప్యంలో ఆ చిన్నపిల్లల బాధ్యత పైనబడగా చదువుకొంటున్న నళినిని పూర్తిగా నిస్మరించింది తల్లి మెయిలు కప్పిస

చందమామలా నలిగిపోయిన నళినిని చూసి మోహన్ చింతాక్రాంతుడైనాడు కుటుంబంలో ఏ ఒక్కరికి బాధ కలిగినా కుటుంబమంతా కుంటుపడుతుంది. రక్తపాశం అలా పీకుతుంది. కలువల్లాంటి కన్నుల్లో కాంతి లోపించింది. పగడపు వర్ణంతో ఎప్పుడూ చిరుదరహాసంతో వుండే పెదాలు బీటలు పడినట్లు ఎండిపోయాయి. నవ్వే అలంకార ప్రాయంగా వుండే నళిని ముఖం మరల కళకళ లాడుతుందా! నళినిని సంతోషపెట్టటానికి తానేమి చెయ్యాలి? అని ప్రశ్నించుకోసాగాడు మోహన్

నళిని హృదయం గాయమైనదని, అది ఎవ్వరూ మాన్పలేరని మోహన్ తెలుసుకోలేక పోయాడు నళిని, అజయ్‌ల ప్రేమ సంగతి



మాచాయగానైనా తెలియలేదు. మోహన్‌కి తెలిపే సమయము సందర్భము రాలేదు. ఎలా చెప్పదాం, ఎప్పుడు చెప్పదాం అనుకుంటూనే దాటేశారు నళినీ, వాసవీలు

'నళిని విషయం తన కెందుకంత బాధ? హేమంతకాలంలో ఉదయాస్తమయాలలో మెత్తబడిన సూర్యునిలా వున్న నళిని దుఃఖం చెరిపివేయాలని తనకెందుకు తాపత్రయం? తన మనస్సెందుకు బాధపడుతుంది? నీటి నుండి బయటపడిన కమలంలా వున్న నళిని నునుపైన నితంబాలు, గుండ్రని ఎత్తైన వక్షం తననెందుకు అంతగా ఆకర్షిస్తుంది' అని పదే పదే ప్రశ్నించుకున్నాడు మనస్సు నుంచి వచ్చిన జవాబుకు విభ్రాంతుడైనాడు

బాధపడ్డాడు భయపడ్డాడు కాని తన మనస్సును మభ్యపెట్టుకోలేకపోయాడు మళ్లించుకోలేకపోయాడు నళినిని మనసావాచా కోరుకున్నాడు మొదటిరోజే తన మనస్సును లాగేసిందని తెలుసుకున్నాడు వాసవికి తాను ద్రోహం చేస్తున్నాడు కృతఘ్నుడైపోయాడు ఏది మోసం? ఏది ద్రోహం? మనస్సులేని వివాహం తప్పు కాదా? వ్యభిచారం కాదా? అని తర్కించుకున్నాడు ఏది ఏమైనా తను ప్రేమించిన నళినిని అలా వదిలేయలేకపోయాడు. స్థిరచిత్తుడై నళిని బాధ్యతను యిష్టంగా స్వీకరించాడు. నలిగిన ఆ అమ్మాయిల దగ్గరికి పలుమార్లు వస్తూ, మాట్లాడుతూ, బయటికి తీసుకువెళ్తూ, మనస్సును సంతోషపెట్టే విషయాలపైకి మళ్లించేవాడు. నళిని ఆ కాసేపు అలా వున్నా, హాస్టల్‌కి రాగానే అజయ్‌ను స్మరిస్తూ, ఆ రాత్రికి ఉత్తరం వ్రాసి హృదయభారాన్ని తీర్చుకొనేది

*    *    *

ఆరోజు కాలేజీకి వెళ్లి వచ్చారు వస్తూనే, వాసవి డైనింగ్ హాలుకి తీసుకువెళ్లింది నళినిని టిఫిన్ తెచ్చి ముందుంచి, ''తిను'' అంది, బల్ల మీద చేతులు పెట్టి చేతులపై చెంప ఆనించి

''నాకు తినాలనిలేదు'' అంది నళిని

వాసవికి విసుగు, కోపం కలిగాయి

''నళినీ! మనం బ్రతుకుతున్నాం బ్రతకాలంటే తిండి తినాలి అలా శరీరాన్ని కష్టపెట్టడంకూడా పాపమే ఉన్న కష్టాలు చాలవని, లేనిపోని రోగాలు వస్తే భరించటం మరీ కష్టం '' అంటూ తాను తినసాగింది

'రాజకుమారిని ఆ వరవర్ణిని ఇప్పుడు ఎవ్వరూ గుర్తుపట్టలేనట్లుంది' అని ఏడుస్తూ అన్నయ్య వ్రాశాడు 'జడలు కట్టిన తలను పూర్తిగా కత్తిరించేశారట తన పనులు తానేమి చేసుకోలేని పసిపిల్ల అయిపోయింది. సంతాపంలో అవయవాలన్నీ విరవిరపోయినవి. ఆమె చెయ్యి చాపి వుంచితే, చాపిన చెయ్యి అలాగే వుంటుంది ముడుచుకోవాలని, కదిలించాలని ధ్యాసే వుండదు. 'పిచ్చి' అని సైకియాట్రిస్ట్‌కి చూపించారు అడిగిన ప్రశ్నలకి ఏడుస్తూ నూతిలో నుంచి మాట్లాడినట్లు మెల్లగా, మెత్తగా జవాబులు ఇస్తుంది. ''అది తీరని వేదన, పిచ్చి కాదు'' అని చెప్పారు ఇది ఏ డాక్టర్లు బాగుచేయలేరు స్థలం మార్పు కాని, గాలి మార్పు కాక ఆత్మస్థైర్యం అవసరమని

మారియన్ ఎయిజ్‌పార్స్ (18) జల క్రీడలంటే సరదా. 1980లో జరుగనున్న ఒలింపిక్ పోటీలో పశ్చిమ జర్మనీనుండి పాల్గొనదలచింది 4/100 మీటర్ల ఫ్రీస్టయిల్ రిలే ఈతలో 55.92 సెకన్లలో ఈది జర్మన్ ఛాంపియన్‌షిప్ప పోటీలో గెలుపొందింది.

# నళిని

పుట్టపర్తి శాంతినిలయంలోకి తీసుకెళ్తామన్న నిశ్చయానికి వచ్చినట్లు తెలిపాడు

'నళినికి ఈ విషయాలు తెలియకపోవటమే మంచిది' అని అనుకొంది. వాసవి పైకి లేస్తూ ''నళినీ'' అని పిలిచింది జవాబు లేదు 'నళినీ!' అంటూ చెయ్యి పైన వేసింది ఉలకలేదు. పలకలేదు భయంగా తట్టింది తల తేలిగ్గా వాలిపోయింది ఒళ్లు చల్లగా వుంది

''నళిని చనిపోలేదు కదా!'' కన్నీటిని ఆపుకొంటూ చల్లని నీరు ముఖాన కొట్టింది గోడ మీద పోసినట్లే చలనంలేదు అంతా అయిపోయింది అంటూ 'నళినీ' అని బిగ్గరగా ఏడవసాగింది ఆ ఏడ్పుకి అందరూ దరిచేరారు లీలగా ఎక్కడో వాసవి ఏడుస్తున్నట్లనిపించింది 'వాసవి' అని పెదాలు కదిలించింది వాసవి గట్టిగా కౌగిలించుకుంది అప్పుడు నళిని కన్నులు రెపరెప లాడించింది. వేడి వేడిగా పాలు త్రాగించి అమ్మాయిల సహాయంతో రూములోకి తీసుకెళ్లి పడుకోబెట్టింది ఉన్నట్లుండి నళిని కాళ్ళు చేతులు కొట్టుకోసాగింది నోట్లో నురుగు చూసి వాసవి బెంబేలుపడిపోయింది నళినిని ఆస్పత్రికి తీసుకొని వెళ్లాలి ఏక్కుతోచక బయటకు పరుగెత్తింది అప్పుడే పిల్చినట్లు మోహన్ వచ్చాడు కారు దిగుతున్న మోహన్‌ని చూసి, ''బావా!'' అంటూ ఏడ్చేసింది. మోహన్ వాసవి వెక్కిళ్లమధ్య చెప్పిన విషయాలు గ్రహించి, గదిలోకి వెళ్లాడు రెండు చేతుల మీద ఎత్తుకున్నాడు ఆ తేలికతనానికి ఆశ్చర్యపోతూ కారులో పడుకోబెట్టాడు వాసవి నళిని తల ఒడిలో పెట్టుకొని కూర్చుంది మోహన్ తాను క్రొత్తగా కొన్న కారుని తెచ్చాడు వారిద్దర్ని ఎక్కించుకొని తిరుమల కొండలు ఎక్కాలను కున్నాడు ఇలా డాక్టరు దగ్గరికి వెళ్లవలసి వస్తుందనుకోలేదు నళినిని సంతోషపెట్టటానికి, ఆకర్షించుకోటానికి కారు కొన్నాడు తనకు తెలిసిన డాక్టరు స్నేహితుని దగ్గరకు నేరుగా పోనిచ్చాడు. నళినిని తీసుకుపోతున్న మోహన్ నళిని తలను గుండెలకు హత్తుకుంటున్నట్లు తాను చూశాను అని అనుకొంది వాసవి. నళిని శరీర స్థితి ఎలా వుందోనన్న ఆతురతలో ... పట్టింపుగా తీసుకోలేదు.

డాక్టరు స్టెత్ పెట్టి హార్ట్ లంగ్స్ పరీక్షించాడు. భయపడేపని లేదని నవ్వుతూ ధైర్యం చెప్పాడు ''వీక్‌నెస్'' అని తేల్చి గ్లూకోజ్ మరేదో వేడిని పుట్టించే ఇంజక్షన్లు నళినికి చేశాడు. నళిని బెడ్ దగ్గర వాసవి నళిని చెయ్యి పట్టుకొని కూర్చునివుంది.

ప్రక్క గదిలో డాక్టరుతో మోహన్ మంద్రస్థాయిలో నళిని కుటుంబ విషయాలు క్లుప్తంగా చెప్పాడు అతని గొంతులో వేదన, నళిని పట్ల ఆసక్తి, ఆతురత, ఏకచింతన స్పష్టమవుతుంది. డాక్టరు అంతా విన్నాక జాలిగా వూకొట్టాడు

''అవన్నీ మరిపించాలంటే పరిసరాలు మారాలి గాలి మార్పు కావాలి అదికాకుండా ఆ అమ్మాయికి హిస్టీరియాలా వుంది అందుకే ఫిట్సు వచ్చాయి ఈ వయస్సులో చాలామందికి అలా వస్తుంటాయి సాధ్యమైనంత తొందరలో పెళ్లి చేయండి పెళ్లి చేస్తే వున్న జబ్బులన్నీ పోతాయి అదే పెద్ద మార్పు...'' అంటూ డాక్టరు పెద్దగానే నవ్వాడు.

నళిని కళ్లు తెరిచి వాసవిని చూసి నవ్వింది ఆ శుష్కహాసం వాసవికి ఎంతో బలం నిచ్చింది వాసవి నవ్వింది ఇన్నాళ్లకి డాక్టరు మాటలకి ఆ ప్రియసఖులు నవ్వారు ఎందుకంటే వారి క్లాస్‌మేట్ సరోజకి ఎప్పుడూ ఛాతిలో నొప్పి వచ్చేది

హౌస్ కీపర్ ఆ అమ్మాయిని ఆసుపత్రికి తీసుకువెళ్లితే, నిద్రకు ఏవో మాత్రలు యిచ్చి, ''ఈ వయస్సు అలాంటిది పెళ్లి చేస్తే అన్ని నొప్పులు పోతాయి'' అని చెప్పాడు డాక్టరు ఆ అమ్మాయి నొప్పి అన్నా ఎవ్వరూ పట్టించుకో లేదు ఫస్ చేస్తుందని సైకలాజికల్‌గా అలా నొప్పి అంటున్నదనేవాళ్ళు. వాసవి, నళినీలు అమృతాంజనం యిచ్చి వీపు, ఛాతి రుద్దేవాళ్లు

కాస్సేపటికి ఉపశమించినట్లు పడుకొనేది వాసవి, నళినీలు ఒకరినొకరు చూసుకొని నవ్వుకొంటూ మెల్లిగా వెళ్లి తమ పడకలపై పడుకొనేవారు. ఒకసారి అలాగే నొప్పి, నొప్పి అంటూ సరోజ నిజంగా ప్రాణాలు వదిలింది

చంద్రరేఖ లాంటి నళిని నవ్వు చూశాడు.

''ఎలా వుందీ?'' అంటూ దగ్గరికి వచ్చాడు

వారిని గాభరా పెట్టినందుకు సిగ్గుపడింది ''తన దుఃఖం తనలోనే ఇమిడిపోవాలి. సంతోషాన్ని యితరులకి పంచాలి. కాని దుఃఖాన్ని కాదు'' అనుకుంది

* * *

మోహన్ అప్పటికప్పుడే కాలేజీకి దగ్గరున్న బాలాజి కాలనీలో రెండు గదులున్న, వంట యిల్లు వున్న మేడ పైభాగం అద్దెకు తీసుకున్నాడు వంటపనికి, తోడుగా ఎప్పుడూ వుండేందుకు పనిమనిషిని కుదిర్చాడు డ్యూటీలవారీగా ఆ యింటిని కనిపెట్టి వుండటానికి వాచ్‌మాన్‌ని పెట్టాడు. అన్ని సదుపాయాలు చేసి, వారిద్దర్ని హాస్టల్‌నుంచి ఆ యింట్లోకి మార్చాడు మోహన్ చేసిన యేర్పాటుకి వారు బదులేమి చెప్పలేదు వాసవికి గార్డియన్ అతను తనకి సంరక్షకుడు బావే యిప్పుడు అని తలచింది నళిని

పుస్తకాలు పట్టుకొని మెట్లు ఎక్కుతున్న నళినికి కళ్ళు తిరిగాయి. పడిపోతూ గాలిలో చేతులు ఆడించింది పట్టుకొరకు. ప్రక్కనే వున్న మోహన్ నళినిని పొదివి పట్టుకున్నాడు అతని భుజంమీద తల వాలిపోయింది ''మైగాడ్!'' అంటూ ఎత్తుకొని వాసవి వైపు చూశాడు అప్పటికే వాసవి తలుపులు తెరిచి పడక సర్దింది.

నళినిని మంచంపై పడుకోబెట్టుతూ, ''ఏమైనా వేడిగా తీసుకొని రా'' అని చెప్పాడు.

హార్లిక్స్ కలపను వంటగదిలోకి పరుగు తీసింది చెమటపట్టిన నళిని నుదురు తుడుస్తూ వెంట్రుకలు సరిచేస్తున్న మోహన్ మనస్సు ఆర్ద్రతతో నిండిపోయింది.

ఇంత సుకుమారికి ఎల్లప్పుడు ఒకరు ప్రక్కన వుండాలి అనుకుంటూ నుదుటిపై అప్రయత్నంగా ముద్దుపెట్టుకున్నాడు

ఆ దృశ్యం రామబాణంలా వాసవి హృదయంలో దూసుకుపోయింది ఆపాదమస్తకం గజగజలాడి పోయింది. నిముషంలో శరీరంలోని శక్తి అంతా ఆవిరైపోయింది. తన సుందర స్వప్నం పేకమేడల్లా కళ్లెదుట కూలిపోయింది ప్రపంచం గిర్రున తిరిగింది

ఎంతసేపటికి వాసవి రాకుంటే వంట గదిలోకి వెళ్లాడు గోడకి చేరగిలబడి కూర్చున్న వాసవిని చూసి, ''వాసవీ!'' అన్నాడు. తన బావని,

## లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో 'నిన్ను ప్రేమిస్తున్నాను' అని గుసగుసలాడే చర్మం

లక్మే వ్యానిషింగ్ క్రీమ్. ఇది మేకప్‌కు, పౌడర్ బేస్‌కు ఎంతో చక్కనిది. మీ ముఖంపై సున్నితంగా .. రక్షణనిచ్చే అనురాగ స్పర్శలా...ఏ వాతావరణంలోనైన సరే.. ఎప్పుడైనా సరే...మీ రూపం అందంగా, తాజాగా, దోషరహితంగా రూపొందేందుకు.




**లక్మే వ్యానిషింగ్ క్రీమ్‌తో**

చర్మ రక్షణ గురించి తెలిసినవారు

**లక్మే**

daCunha/L-VC/LT/4 TL

చిన్ననాటి స్నేహితుడు, తన భర్త అనుకున్నవాణ్ణి కళ్లెత్తి చూడలేకపోయింది.

"వాసవీ! నీవూ అలసిపోయావూ" అంటూ రెండు గ్లాసుల్లో హార్లిక్స్ కలిపి, ఒక గ్లాసు వాసవి చేతికిచ్చాడు. ఒకటి నళిని కొరకు తీసుకువెళ్లాడు

గడగడ త్రాగి స్తిమితపడింది స్వతహాగా మనోధైర్యం కల వాసవి. కోపాలు, తాపాలకు, ఈర్ష్యాసూయాలకి ఇది సమయం కాదు అని మనస్సును కంట్రోల్ చేసుకుంది.

తనేమి చేసినా నళినికి తగులుతుంది ఆ దెబ్బ తప్పాకరిదైతే శిక్ష మరొకరిదవుతుంది. ప్రేమశీల, సుకుమారి నళినికి కలలోకూడా ఆ తలంపు వుండదు తననుంచి ప్రియసఖికి హాని జరిగిందని అనుకున్న రోజు ప్రాణాలతో వుండదు.. ...

కాలంతో కాలు కదపటం తప్ప మరేమి చేయలేని స్థితి. యుద్ధం ఎందరి జీవితాలను తారుమారు చేసింది వుబికి, వుబికి వస్తున్న దుఃఖాన్ని గుండెల్లో దాచుకొంది, శివుడు కాలకూట విషాన్ని గళంలో దాచినట్లు.

కాలేజి మానేసి కొన్ని రోజులు విశ్రాంతి తీసుకోమని వాసవికి చెప్పి టానిక్కులు, బిస్కెట్స్, చాక్‌లెట్స్, కొత్త కొత్త నవల్స్ తెచ్చి యిచ్చి "మరో వారానికి కాని రాను ఫీల్డ్ వర్క్ బోలెడుంది మీ పుణ్యమా అని ఆఫీసు ఫైల్సు పాపం పెరిగినట్లు పెరిగిపోయింది" అంటూ హెడ్‌క్వార్టర్స్‌కి తిరుగుముఖం పట్టాడు మోహన్ పోతూ పోతూ నళిని వైపు చూసిన చూపులోని భావాలు వాసవి గుర్తించకపోలేదు మనస్సు నిర్వికారం చేసుకుంది

మోహన్‌కి 'చాయ్' చెప్పి గదిలోకి వచ్చారు. వాసవి నుదుటి మీద చెయ్యి పెట్టుకొని పడుకొంది

"వాసవీ! నీవు అలసిపోయావు" బావ అన్నట్లే నళిని పలికింది

చేతి క్రిందుగా నళినిని చూసింది. తన కంట నీరు కనపడకుండా ఎడం చెయ్యి చాటు చేసుకొంది వాసవి

"వాసవీ! మిమ్మల్ని కష్టపెట్టాను. స్వార్థంతో ప్రవర్తించాను మీ ఋణం యెలా

# నళిని

తీర్చుకోను?" నిట్టూర్చి, "మనుషుల్లో దేవుడుంటాడని ప్రత్యక్షంగా చూశాను బావ సహృదయుడు. వాసవీ! నా ఆయుస్సు పోసుకొని బావ చిరకాలం వుండాలి. దీర్ఘసుమంగళిగా, సౌభాగ్యవతిగా నీవు వర్థిల్లాలి మిమ్మల్ని చూస్తూ నేను బ్రతకాలి..." కిటికీలో నుంచి శూన్యంలోకి చూస్తూ ఏవో జ్ఞాపకాల నుంచి పారిపోవాలని ప్రయత్నిస్తోంది నళిని.

నళిని మాట్లాడకపోవటం చూసి వాసవి, నళినిని చూస్తూ,

"ఎక్కడికైనా, సినిమాకి పోదామా?" అంది లేస్తూ. వాసవిని పడుకోబెట్టుతూ, "బావ చెప్పింది మరచిపోయావా? చదువు కూడ మానేసి నిన్ను విశ్రాంతి తీసుకోమన్నారు. నానుంచి నీవు నలిగిపోయావు..." మొదటిసారిగా వాసవిని చూస్తున్నట్లు చూసి,

"వాసవీ! నీ ముఖం వాడి వుంది. కళ్లు లోతుకు పోయాయి అందుకే బావ అంత బాధపడిపోయాడు. ఎందుకే నేనంటే అవ్యాజమైన ప్రేమ మీకు. ఈ అల్పురాలు తిరిగి మీకేమి యిస్తుంది ప్రతిఫలం కోరని ప్రేమ మీది అందుకు తగనేమో? మీ అనురాగాన్ని తలచుకొంటే నా మనస్సు, కడుపు దేవినట్లు వుంది నా కడుపు .. కడుపు .."

కళ్లు విచ్చుకొని వాసవిని చూసింది నళిని అంతే ఆశ్చర్యంగా నళిని వైపు చూసింది వాసవి ఎత్తుగా, నిండుగా చనుమొనలు, అంత నీరసంగా వున్నా నళిని చెంపలు నున్నగా, ముఖం కాంతిగా, కళగా వుంది.

కన్నార్పను భయంవేసినట్లు ఒకరినొకరు చూసుకుంటూ వుండిపోయారు.

అప్రయత్నంగా వాసవి చూపు నళిని కడుపు పైకి జారింది. అప్రయత్నంగా నళిని చెయ్యి కడుపు మీదకి పోయింది.

"వాసవీ! ... అజయ్ అజయ్" అంది అస్పష్టంగా వారికి ఆరోజు అతికష్టంగా తెల్లవారింది.

"అజయ్! అజయ్! నీ పేరే అజయ్! నీకు ఓటమిలేదు. చావులేదు. నీ ప్రాణం నాలో వుంచావు నీ ప్రతి రూపు నాలో నిలిపావు నా జీవితం వ్యర్థం. నా బ్రతుకు మోడు అని అనుకున్నాను. నేను శుష్కించిపోను. చచ్చిపోను నా జీవితానికో సార్థకం, బ్రతుక్కి ఓ అర్థం వుంది. అజయ్! నీకోసం, మన పాప కోసం నేను బ్రతుకుతాను. అజయ్...అజయ్!" నళిని కలవరింపు మాటలు ఆ రాత్రి అంతా వింటూనేవుంది వాసవి విని నిర్విణ్ణురాలైంది క్రొత్త దిగులు, క్రొత్త బాధ్యత పెనవేసుకొని వుక్కిరిబిక్కిరి చేశాయి

ప్రాక్టికల్‌గా ఆలోచించసాగింది

'పెళ్లి కాకుండానే బిడ్డని కని సంఘానికి ఏమని జవాబు యిస్తుంది? తల ఎత్తుకొని తిరగనిస్తుందా? కాకుల్లా పొడిచి పొడిచి తరిమేయదూ? రేపు తండ్రిలేని పాపాయిని లోకం ఎలా స్వీకరిస్తుంది? "బాస్టర్డ్" అని ముద్ర వేయదు? ఆ బిడ్డ భవిష్యత్తు ఏమిటి?

ఈ పరిస్థితుల్లో నళిని బిడ్డని కంటే, వారి కుటుంబం, ముసలి తల్లి ఏమైపోతుంది పెద్ద కుమార్తె విధవైనందుకు బాధపడుతుందా? కన్నెపిల్ల తల్లి అయినందుకు ఏడుస్తుందా? గాయం మీద కారం చల్లినట్లు గిలగిల లాడిపోదూ?... ప్రేమ స్వరూపిణి నళినిని కామస్వరూపిణి అని అంటారు పట్టుకుంటే చిట్లిపోయే గాజుముక్క నళినికి అవన్నీ సహించి ఓర్చి, కన్నబిడ్డని పెంచి పెద్దచేసే శక్తి వుందా? పుట్టిన పాపాయి సవ్యంగా పెరిగే అవకాశం యిస్తుందా? ఈ పాపిష్టిలోకం తల్లి పవిత్రతని, ప్రేమని ఆ పాప తెలుసుకోలేక మరో విధంగా వూహిస్తే, ఆ పాప మనస్తత్వం సరిగా వుంటుందా! లోకానికి విరుద్ధంగా పుట్టిన తన బ్రతుకుమీద పగ, కక్ష పెంచుకుంటే? ?...' ఎన్నో ప్రశ్నలు జోరీగల్లా వాసవిని ముసురుకొని బాధపెట్టాయి ఆ బాధ శారీరకంగా, మానసికంగా అలసిపోయి తెలతెలవారుతుండగా కన్నులు మూసుకొంది

# మా ఊరిలోని స్త్రీలంతా ఈ సరికొత్త డిటర్జెంట్ సబ్బు బిళ్ళ గురించే ప్రస్తావిస్తున్నారు



భారతావనిలో తయారుచేయబడే డిటర్జెంట్ సబ్బులలో స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ వినూత్నమైనది. ఇంత విశిష్టవంతమైన నీలిరంగు డిటర్జెంట్ సబ్బు బిళ్ళ లోగడ మీకు పరిచయం చేయబడలేదు. మురికిని నిర్మూలించి మిరుమిట్లు గొలిపే తెల్లదనంతోపాటు, జిగేలు వరచేటట్లుగా బట్టలను ఉతక గలందులకు నవీన పద్ధతిని మేలువరచబడినది ఈ అధునాతనమైన నీలిరంగు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ. మీ దుస్తుల స్వచ్ఛందమైన తెల్లదనానికి, పరిశుభ్రతకు స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళనే వాడండి. వినూత్నమైన స్కోర్ డిటర్జెంట్ సబ్బు బిళ్ళ విశిష్టమైన అంశాలను కలిగివున్నందువల్లనే మీ ఊరిలోని వనితలు యావన్మందీ దీనిని గురించే ప్రస్తావిస్తున్నారు.

## ఇదే లేటెస్ట్ స్కోర్..!




స్కోర్ అత్యధికంగా ఆటరాగలదు. నేడే కొనండి! వాడి చూడండి!!

కేరళ స్టేట్ డిటర్జెంట్స్ & కెమికల్స్ లిమిటెడ్ (ఒక ప్రభుత్వ సంస్థ)

FDS KSDC 2797 TEL A

సూర్యుడు బాగా పైకి వచ్చాక వాసవికి మెలకువ వచ్చింది. మల్లెపువ్వు లాంటి చీరలో వున్న నళిని తల విరియబోసుకొని హార్లిక్స్ త్రాగుతూ కనిపించింది.

"శరీరం శుభ్రంగావుంటే మనస్సు స్వచ్ఛంగా వుంటుంది..." తీయగా నవ్వుతూ, "వాసవీ! పోయిన నిద్ర చాలుగాని, త్వరగా లే. గర్భిణీ స్త్రీలు తీసుకోవలసిన జాగ్రత్తలు, క్రొత్త పాపాయిని ఎలా ఆధిత్యం యివ్వాలో వగైరాలు తెలిపే పుస్తకాలు కొనుక్కుందాం..."

వెన్నెలలా స్వచ్ఛంగా వున్న నళిని, ఆమె అమాయకత్వానికి హృదయం మూలిగింది. త్వరపడకుండా మెల్లిగా ఒక్కొక్క సమస్యను నళిని ముందు పరచింది. తొందరపడకుండా ఆలోచించమంది వాసవి.

నళిని ఆ వాస్తవికతకు బిత్తరపోయింది. ఆశ్చర్యపడింది. గుండెలవిసిపోయాయి. నరాలు తిరిగిపోయాయి. కళ్లప్పగించి వాసవిని చూసింది.

"నా కర్తవ్యం ఏమిటి? నేనేమి చెయ్యాలి?"

"అన్నిటికి ఒకటే సమాధానం. అబార్షన్."

"మైగాడ్! వాసవీ భ్రూణ హత్య..."

"హత్యకాదు. న్యాయసమ్మతమే."

"వీలుకాదు. నా పాపని చంపుకోలేను. ఒక పాపం చేశాను. మరో పాపం చేయను చేయలేను!"

"ఆ...చెప్పతుంది వాసవి కాదు. నా వాసవి అలా ఎప్పటికి చేయనీయదు. స్థైర్యం కలది. జీవితంలో తప్పటడుగు నేయనిది. జీవితం నుంచి పారిపోనీయదు... ..."

వెక్కివెక్కి ఏడుస్తున్న నళిని తల నిమురుతూ,

"నళిని మనమేతెము. మన చుట్టూ ఎన్నో ప్రాణాలు, వారి బ్రతుకులు మనకి అల్లుకొనిపోయి వున్నాయి. వారి సంగతి మనం ఆలోచించాలి."

"వాసవీ! నేనేం పాపం చేశాను? నాకెందుకీ శిక్ష?"

"నీవేం పాపం చేయలేదు. రాముడంతవాడు అతనికొచ్చిన కష్టాలకి 'నేనేం పాపం చేశాను' అని ఏడ్చాడు. మనకు తెలుసుగా రాముడు ఏ పాపం చేయలేదని. దైవాంశ సంభూతుడని. విధి. విధి ఆడించినట్లు ఆడే బొమ్మలం మనం... లే... డాక్టరు దగ్గరికి పోదాం. ఆలస్యం చేయటం మంచిదికాదు" అనునయిస్తూ బలవంతంగా వుమెన్స్ ఆస్పత్రికి తీసుకెళ్లింది వాసవి. వాసవి మాటలో మంత్రించినట్లు శవంలా లేచివచ్చిందినళిని.

డాక్టరమ్మ పరీక్షిస్తూ ప్రశ్నలు వేస్తుంటే అప్పుడు తెలివిలోకి వచ్చింది నళిని.

"పెళ్లయి ఎంత కాలం అయిందమ్మా?"

"పెళ్లి కాలేదు డాక్టర్."

"ఐసీ... గర్భిణీ అని తెలుసుగా. మూడో నెల. కారకుడైన అతనిని తీసుకొని రామ్మా" అని డాక్టరమ్మ మెత్తగా చెప్పింది.

"డాక్టర్! ఎవ్వరు పిలిచినా అందనిచోట వున్నాడు. డాక్టర్! నా పిలుపు అందుకున్నా రాలేరు. రాలేరు." టేబుల్ మీద వున్న నళిని వెక్కి వెక్కి ఏడ్చింది బిగ్గరగా.

డాక్టరమ్మ కళ్లలో నీళ్ళు సుళ్లు తిరిగాయి.

దగ్గరవున్న వాసవి తామెందుకొచ్చిందో భయంభయంగా చెప్పింది. డాక్టరమ్మ సానుభూతి చూపిస్తూ, అంతా వింది.

"మీరు చేసే పనిలో యిప్పుడు తప్పులేదు అంటూ డాక్టరమ్మ ధైర్యం చెప్పింది.

"పాకిస్తాన్ చేసిన దురాగతాల్లో ఎందరి స్త్రీల జీవితాలు బలైపోయినవి. బాంగ్లాదేశ్ యువతులకు వీలైనంతవరకు అబార్షన్లు చేశారు. వీలులేని వారి పిల్లల్ని రెడ్‌క్రాస్‌వారు విదేశాలకి పంపి దత్తతయిచ్చేశారు. ప్రపంచంలో ఏదిజరిగినా, దాని ఫలితం స్త్రీ లనుభవించాల్సిందే..." అంటూ,

అబార్షన్ చేయటానికి సామాను సిద్ధం చేయ మని చెప్పి నళిని కేస్ షీట్ వ్రాసింది డాక్టరమ్మ.

టేబుల్ మీద పడుకున్న నళిని కన్నీటి తెరలో అజయ్ నగ్నదేహం తేలియాడింది. అజయ్ మెల్లిమెల్లిగా కరిగిపోయి, పసిబాలుడై కాళ్ళు చేతులు ఆడిస్తూ నవ్వుతూవున్నాడు. అంతలో శస్త్రం ఆ చిన్నారిబాబు కాళ్ళని, చేతులని దేనికది తెగేస్తుంటే ఆ బాబు కుక్కపెట్టి ఏడుస్తున్నాడు. తుపాకితూటాతో గాయమై గిలగిల కొట్టుకుంటూ, "నళిని నా బాబు...నా బాబు" అని ఏడుస్తున్నాడు అజయ్. తన అజయ్ ఏడుస్తున్నాడు. తన బాబు ముక్కలు ముక్కలైపోయాడు.

'కెవ్వు'మని అరుస్తూ బల్లమీద నుంచి దూకేసింది నళిని.

"నేను కులటను, భ్రష్టను ఏమైనాసరే! నా బాబుని చంపుకోలేను. డాక్టర్ మీకు శ్రమయిచ్చాను. క్షమించండి" అంటూ బయటికి వచ్చేసింది.

[ఇంకా వుంది]



# విలువ

తాసల నాగభూషణం

మేడ గుడిసెని వెక్కిరిస్తుంది. అందులో ఆశ్చర్యమేం లేదు. ఉన్నవాడు లేనివాణ్ణి చులకనగా చూస్తాడు అది నేడే మనకి కొత్త కాదు. కాని పూరిపాకలో పేదరికంతో బ్రతుకుతోన్న నా సానుభూతికి గురయినవాళ్ళు కూడా మా ఇంటిని మా పక్కనున్న మేడలతో పోల్చిచూసి, నన్ను మా ఇరుగుపొరుగు కుబేర పుత్రులతో బేరీజువేసి తేలిక చేస్తారంటే నాకు ఆశ్చర్యం కలగడమే కాదు — మనస్సు కూడా కలుక్కుమంది లోపలెక్కడో.

ఆరోజున ఫ్యాక్టరీకి సెలవయితే ఉదయం ఆరేడుగంటల వేళ ఆ వారం రోజుల శ్రమా తీరిపోయేట్టు తలారా స్నానం చేద్దామని బట్టలు విప్పవడేసి కేవలం డ్రాయరుతో, నూనె గిన్నె ముందుంచుకుని పీట వాల్చుకుని కూచున్నాను ఇంట్లో. అరచేతి నిండుగా నూనెని వొంపుకుని ఆ నూనెతో నడినెత్తిని తడిపి మెత్తగా తట్టుకుంటున్నాను. అప్పుడే మా వీధి చివరలో ఓ వేపునించి సన్నాయి స్వరం వినబడితే ఇంట్లోంచి మా నానిగాడూ, బుజ్జీ ఇద్దరూ బిలబిలమంటూ పరుగెత్తేరు వెలుపలికి.

కొంతసేపు సన్నాయిస్వరం వినబడడం, అది అటు ఆగగానే ఏదో సంతోషం పట్టలేనట్టు పిల్లలందరూ మూకుమ్మడిగా చప్పట్లు చరచడం— నా ధ్యాస అటువేపు మళ్ళడానికి కారణాలయ్యేయి.

ఎవరో గంగిరెద్దుల ఆటగాళ్ళు నడివీధిలో నోళ్ళులేని ఆ గంగిరెద్దుల్ని సైతం తమ సన్నాయి స్వరం చేత తలలూపింపజేస్తున్నారనీ, వాటిచేత కవాతు చేయిస్తున్నారనీ నేనూహించగలిగేను.

పెద్ద పెద్ద అంగళ్ళలో అద్దాల షోకేసుల్లో అమర్చబడి అందగత్తెలయిన సేల్స్ గాల్స్ చేతుల్లోంచి ఖరీదుగా వచ్చే వస్తువే ఫుట్‌పాత్‌ల మీద కారుచవగ్గా దొరకడం మనకి తెలుసు. అంటే మనుషుల విలువే కాదు — ఓ వస్తువు తాలూకు విలువ కూడా స్థానబలిమినిబట్టి మారితీరుతుందన్నమాట. అల్లాగే స్థానాన్నిబట్టి కళకి కూడా విలువల్లో మార్పులు రావడం నిజంగా శోచనీయం. అయినా అది అనివార్యం.

కాకుంటే ఆనాటి ఆ గంగిరెద్దుల ఆటగాళ్ళ సన్నాయివాద్య సంగీతాన్నే ఏ పెళ్ళిళ్ళలోనో, పేరంటాళ్ళలోనో ఏర్పాటు చెయ్యదల్చుకుంటే ఎవరయినా ఎన్ని వందలిచ్చుకోవలసొచ్చేదో! అంత బావుంది ఆ సన్నాయివాద్యం!

దాన్ని వింటూ నా తలంటు పూర్తి చేసుకునేసరికి మా నానిగాడూ, బుజ్జీ వీధిలోకి వెళ్ళినంత విసురుగానూ వచ్చేరు ఇంట్లోకి.

నూనె రాసుకున్న నా ఒంటినిసైతం ఖాతరు చెయ్యక నన్ను తాకి నిలబడుతూ అన్నాడు నానిగాడు "నానా!... నానా! ఆ గంగిరెద్దులేమో... అతను పాడిన పాటకి ... ఎంత బాగా ఆడేయమ కున్నావ్ — తలూపుతూ. మరేమో వాళ్ళు ... ఆ ఎద్దుల్ని తీసుకుని ... వొస్తున్నారు ప్రతి ఇంటికీ మనకి తోచింది ఇవ్వొచ్చు వాళ్ళకి." పరుగెత్తుకొచ్చినందువల్ల కలిగిన అలసటతో ఓ వంక వగరుస్తూనే తను చెప్పదల్చుకున్న మాటన్నీ చెప్పేడు వాడు.

వాడటు ముగించగానే అందుకుంది మా బుజ్జి "నానా! మనం గనక బట్టలిస్తే రంగులు రంగులుగా వాటినన్నింటినీ కలిపికుట్టి ఇంతలావున కప్పుతారు వాటి మూపురాలమీద. ఎంచక్కా వుంటాయో తెలుసా అవి యెత్తుగా. మనమూ అమ్మనడిగి ఓ చీర ఇద్దాం." ఇల్లా అంటూనే చివరి మాటని సగం తన నోట్లో వుంచుకునే వాళ్ళమ్మకోసం పెరట్లోకి పరుగు తీసింది బుజ్జి.

నేనూ ఆ ఉదయాన అంత సరసం సంగీతాన్ని అందించిన ఆ అజ్ఞాత కళాకారులకి మనసులోనే కృతజ్ఞతలు తెలుపుకుంటూ నాకున్నంతలో ఏదో ఇంత సాయం చేద్దామనే ఉద్దేశంతోనే వున్నాను. పైపెచ్చు మా పిల్లల మొమ్మకోలు మాటలకి మరింత ముచ్చటపడి వాళ్ళనీ సంతృప్తిపరచాలని అన్నాను నానిగాడితో

"నానీ! నా ప్యాంటు జేబులో ఎంతుందో చిల్లర— చూడు!"

నేనా మాటనడం తరువాయి ఒక్క వూపున వెళ్ళి గోడకున్న కొంకికి తగిలించిన నా కాకి యూనిఫాం ప్యాంటు జేబుల్ని కెలికి చిల్లరని చేతినిండుగా తీసుకొచ్చేడు నాని. నా పక్కనే కూచుని నేలమీద కుప్పగా గుమ్మరించేడు. ప్రశ్నార్థకంగా నావేపు చూసేడు.

"నానీ! ఎంతిద్దాం మనం వాళ్ళకి?" నేనడిగేను వాణ్ణి వాని చూపులోని ప్రశ్నని అర్థంచేసుకుని.

"ఓ రూపాయి" చిల్లర లెక్కెడుతూ కుడిచేతి చూపుడువేలుని మీదికెత్తి అన్నాడు నానిగాడు మురిపెంగా.

ఇంతలో మా విశాలాక్షి చేతిని పట్టుకుని లాక్కొచ్చే రీతిలో లోపల కొచ్చింది బుజ్జి.

"ఏమిటండీ! చీరేదో ఇమ్మన్నారుట." లోపలికొస్తూనే అడిగింది విశాల.

"ఇమ్మని నేననలేదే విశాలా! నీ కూతురే అంది ఇద్దామని ఏదైనా వుంటే ఓ చీరివ్వు — పాతదిగా చూసి."

"ఉన్నవన్నీ పాతవే అయితే ఇక వేరుగా చూడ్డం యెందుకులెండి!" నా పురమాయింపుకి మా ఆవిడ ఇచ్చిన సమాధానం అది.

అంతకు వారంరోజుల క్రితమే వాయిదాల పద్ధతి కింద చీరలిచ్చే ఓ ఆసామి దగ్గర తను కోరిన చీరని తీసివ్వలేదని రెండు మూడు రోజుల వరకూ మా ఆవిడ అలకపాన్పు వేసిన సంగతి గుర్తుకొచ్చింది నాకు ఆ మాటతో అయినా ఏం చెయ్యను? కష్టాన్ని కరెన్సీ కింద మార్చుకుని, నవ్వు వెనక ఇంత ఏడుపునీ దాచుకుని అణాపైసల లెక్కలతో జీవితాన్ని వెళ్ళమారుస్తోన్న ఓ మామూలుపాటి కార్మికుణ్ని నేను కనీసం కూడుగుడ్డల విషయంలోనయినా మా అవసరాలకి మించి ఏ ఆడంబరాలకీ వెళ్లలేనివాణ్ని వెంకటగిరి నేతచీరల్ని కాక విదేశీ నైలాక్సుల్ని యెల్లా కొనివ్వగలను ఆవిడకి కట్టుకోడానికి?

కొంత వెలిసి, రంగు మాసి ముమ్మూర్తులా మా బ్రతుకులా వున్న చీరనోదాన్ని పట్టుకొచ్చింది విశాల — పాత ట్రంకుపెట్టెల్లో వెదికి

దాన్ని చూస్తూనే "బలేవుంది చీర. అమ్మా! నే ఇచ్చిరానా?" అంటూ తన చేతిలోకి తీసుకుంది బుజ్జి

"రారా నానీ! వెళ్లి ఇచ్చివొద్దాం వాళ్లకి" అంటూ అమాంతం గుమ్మంవేపు పరుగెత్తబోయింది

దానికి అడ్డుతగిలి "మనమే వెళ్లి ఇవ్వక్కర్లేదు వాళ్లకి వాళ్లే వొస్తారు ప్రతి ఇంటికీ ఇంటింటి ముందూ ఆగి, కాసేపు సన్నాయి వాయించి ఆపైన అడుగుతారు డబ్బులో, బట్టలో, ఏవయినా గింజలో!" అంటూ దాని చెయ్యిపట్టి ఆపేడు నాని

"అల్లాగే చేద్దాం" అన్నట్టుగా ఓ నవ్వు నవ్వి మడతలుపెట్టిన చీరని గుండెలకేసి హత్తుకుని వాకిట్లోంచే బయటికి చూస్తూ నుంచుంది బుజ్జి.

చిల్లరని గుప్పిట్లో బాగా బిగించి పట్టుకుని దాని పక్కనే వెళ్లి నుంచున్నాడు నాని

వీధిలో సన్నాయి వాద్యం ఆగి ఆగి వినబడుతోంది అంటే యాచనకోసం ప్రతి ఇంటి ముందూ ఆగుతూ సన్నాయి మ్రోయిస్తూ వొస్తున్నారన్నమాట — వాళ్లు!

ఒకందుకు నాకూ మా పిల్లల్ని చూస్తోంటే కడుపుని పాలతో నింపినట్టుంటుంది మనకుందా లేదా అన్న ఆలోచనలేదు వాళ్లకి ఎవరయినా తమకంటే తక్కువ స్థితిలో కష్టాల్లో వున్నట్టనిపిస్తే చాలు నేరుగా నా దగ్గరికో, వాళ్లమ్మ దగ్గరికో వొచ్చి వాళ్ల కష్టనష్టాల్ని ఏకరువుపెట్టి వున్నంతలో ఏదో ఇంత వాళ్లకి అందేలా చేస్తారు. తామే స్వయంగా తీసికెళ్లి ఇస్తారు ఆ లేత లేత మనసుల్లో — వాళ్ల ఈడు అని పిల్లలు సంబరపడుతోన్నంతలోనే చప్పుడు కాకుండా చల్లగా మా ఇల్లు దాటి — మా గంగిరావిచెట్టు కింది పూరిగుడిసెని దాటి—అవతలి అడ్వకేటుగారింటి ముందు మ్రోగింది

నానిగాడూ బుజ్జీ, నేనూ మా ఆవిడా క్షణంసేపు నివ్వెరపోయి ఒకరి మొహాలొకరం చూసుకున్నాం.

"ఏమైంది వాళ్లకి? ఎందుకు రాలేదు మనింటికి?" ఒకరి తర్వాత ఒకరు అమాయకంగా ప్రశ్నించేరు వాళ్లమ్మవేపు నావేపూ మార్చి మార్చి చూసి

నేనూ స్తబ్దుగా నుంచున్నాను కాసేపు మనసుకేమీ పాలుపోలేదు. నానిగాడు బుజ్జీల బిక్కమొహాలు మరింత నన్నవమానించినట్టని పించింది ఎందుకో

ఏదీ ఆలోచించక, కేవలం డ్రాయరుతోనే వున్నానన్న జ్ఞానమయినా లేక ఇంటి బయటికొచ్చి వీధి నుంచి మా ఇంటిని వేరుచేస్తూ నుంచునివున్న తడిక పక్కకి చేరి చూసేను వీధిలోకి

నానీ, బుజ్జీ అంతసేపూ తెగమెచ్చుకుని, అంత హంగామాచేసి చివరికి దిగులు మొహాలతో మిగిలి నుంచోవలసిన పరిస్థితిని కల్పించిన ఆ గంగిరెద్దుల ఆటగాళ్ల బృందం తమ నాదస్వర కచేరీతో కనిపించేరు నాకు — ఎత్తయిన మా పక్కింటి మేడ ముందు!

ఒప్పున సరాసరి నా గుండెల్లోకే విద్యుత్తు ప్రసరించినట్టు న మనసులోకి వొచ్చింది ఓ ఆలోచన ఆ ఆలోచనతోటే తల తిప్పి మా ఇంటి కటువేపుగా చూసేను. అది పంతులమ్మగారి రెండంతస్తుల భవంతి!

అంతే! దానితో నా ఆలోచనలోని అనుమానం నిజమనిపించింది. తల తాకట్టు పెట్టినట్టయింది ఇక అక్కడుండలేక తల వొంచుకుని తిన్నగా నడిచేను — మా ఇంట్లోకి

"నానా! వాళ్లెందుకని రాలేదు మనింటికి?" అడిగేరు ఒక్కమారే పిల్లలిద్దరూ

ఆ అర్థం వొచ్చేట్టే అల్లాంటి చూపుతోనే నా కళ్ళలోకి -- మనసులోకి - గుచ్చిచూసింది మా ఆవిడ

నేనేం చెప్పను సమాధానం?

వెలిగే రెండు కరెంటు దీపాల మధ్య కరిగే ఓ కొవ్వొత్తి తాలూకు కాంతిపూరాన్ని యెవ్వరూ కోరుకోరని చెప్పనా?

నిటారుగా నింగిలోకి లేచిన రెండు మేడల మధ్య నేలలోకి నిలువునా కూరుకుపోయే మా పూరిపాక విలువ తేలిపోయిందని చెప్పనా?

ఏం చెప్పను? పైపై మెరుగులు చూసే కళ్లకి మాలో, మా ఇంట్లో ఏ విలువ కొరవడిందని ఆ చిన్నారి మనసులకి నచ్చజెప్పను?

అందుకే నోట మాట రాక, మనసుండబట్టక ల నూనె అంటిన చేతివేళ్లతోనే నా కళ్ల తడిని తుడుచుకున్నాను మౌనంగా — తల వొంచుకుని ★

## విలువ

పిల్లల్లో ఆమాత్రం కారుణ్యం నెలకొంటే ఇక రానున్న మానవ సమాజం శాంతి స్థావరం అవుతుందనడంలో సందేహం లేదు.

తిని మిగిలినవాళ్ళిచ్చిన ఓ తట్టెడు అన్నంకన్నా తన కడుపుగిట్టి తల్లి పెట్టిన ఒకే ఒక్క గుప్పెడు మెతుకుల విలువ యెక్కువ!

నేనున్న స్థితిలో మా ఆవిడ కట్టుడుచీర, నా జేబులోని రూపాయి — ఎక్కువే నాకు.

పిల్లలిద్దరూ వాకిట్లో నుంచునే యెదురు చూస్తున్నారు వాళ్లకోసం ఆశగా.

దూరంగా వినబడుతోన్న సన్నాయి సంగీతం ఆగి ఆగి, దగ్గరగా జరిగి జరిగి "అదిగో మన పక్కింటి పంతులమ్మింటి కొచ్చేరు. ఇక మనింటి కొస్తారు అల్లదిగో! వొచ్చేస్తున్నారు ఒచ్చేసేరు"

## విజయపతాకం

ఓ కవితా! నా కవితా! రా!
మెల మెల్లన కాదు,
ఘలు ఘల్లున గంభీరంగా
కదనోత్సాహంతో
గాఢ దీక్ష దాహంతో రా!
నా కవితా! ఓ కవితా! రా!

ఉత్తమ శీల పరిశీలనా
యత్నంబైన చిత్తముతో
మానవతనీ నవ నవతనీ
మంచినీ వెతుకుదాం, రా!

మేలిమాడినా తూలనాడినా,
వేళాకోళాల వెక్కిరించినా,
హిరణ్యకశిపులకి నరసింహాలుగా
సోమకులకి మహా తిమింగలాలుగా
విరుచుకు పడదాం; వియత్తలంలో
ఎగరేద్దాం మన విజయ పతాకం!"

— వజ్జల కాళిదాసు



'కల్యాణ రాముడు'లో కమలహాసన్

## బొమ్మలకొలువులో భామ అలుక

టెలిఫోన్‌లో శోభ (కాంచన) గాభరాతో ''అలానా, ఇన్‌స్పెక్టర్ ? ఆఁ ... నౌకరుగాడి ప్రాణం పోతేపోయింది. విలువైన డబ్బు పోయిందే! ఇంతకీ, మావారు క్షేమంగానే వున్నారుగా ? ఏమన్నారూ ? ఆయన బయలుదేరి వెళ్ళి చాలాసేపయిందా ? ఓ—కే ... థాంక్స్ ?'' అంటూ రిసీవర్‌ను పెట్టేసిందో లేదో ధర్మారావు (జగ్గయ్య), రాందాసు (మాస్టర్ రాజు)ని తీసుకొనివచ్చాడు. ''దారిన పోయే ప్రతి వెధవనూ

# సినిమా విశేషాలు

—జి.వి.జి

ఇంట్లోకి తేవటం...'' అంటూ శోభ ఉడికి పోయింది.

''వాడు దారిన పోయేవాడుకాదు. ఈ ఇంట్లో వుండడానికే తెచ్చాను. ఇకనుంచి ఇక్కడే మన పిల్లల్లో ఒకడుగా వుంటాడు. వీడి తండ్రి నా ప్రాణానికి తన ప్రాణం అడ్డంవేసి నన్ను బ్రతికించాడు. వీడ్ని దిక్కులేనివాడ్ని చేసిపోయాడు,'' అన్నాడు ధర్మారావు.

''తెలిసింది. అందుకు ఏదోపరకో వాడి మొహాన పారెయ్యండి. పోతాడు.''

''అంటే — నీ ఐదోతనం విలువ పదో పరకోనన్నమాట! హుం. శోభా, నేనే చచ్చివుంటే, నీ పిల్లలకీ వీడి గతే పట్టివుండేది. మైండిట్ !''

శోభ మరింత రెచ్చిపోయి, నౌకర్ను పిలిచి, ''వీడ్ని తీసుకెళ్ళి పని నేర్పి, వేళకింత తిండి పడేయ్,'' అంది.

ధర్మారావుకూ కోపం ఆగిందికాదు. ''శోభా! వీడు పనివాడుకాడు. నాతోపాటే వుంటాడు. నే తినే తిండిలో ఓ ముద్ద తింటాడు. అలాగైనా వీడి తండ్రి ఋణం తీర్చుకుంటాను.''

''చూడండి! ఈ ఇంటికి తేవటంవరకే మీ పని. ఇంట్లో ఎవర్ని ఎలాచూడాలో — అది నా విషయం. నా ఇష్టం. కాదంటారా — నా పిల్లల్నీ, నా ఆస్తినీ తీసుకొని నేనే బయటకు పోతాను,'' అంటూ విసురుగా మేడపైకి వెళ్ళిపోయింది.

అయోమయంగా చూస్తున్న ధర్మారావు దగ్గరికి రాందాసు వచ్చి, ''అయ్యగారూ! నేను పని చేస్తానండి. నాకు అన్నిపనులూ చేతనవునుగా?



'గు ప్పె డు మ న సు'లో సరిత

అంట్లు తోముతాను. నీళ్ళు తోడుతాను. అన్నం ... కూరలు కూడా వండుతాను. నిజం, బాబుగార్లూ!'' అన్నాడు. అతన్ని దగ్గరికి తీసుకుంటూ, ''బాబూ, రాందాసూ! యింత మంచివాడివి—ఈ లోకంలో ఎలా బతుకుతావురా?'' అన్నాడు ధర్మారావు.

ఈ చిత్రంలోని చంద్రమోహన్ పాత్రను వివరిస్తూ, ''అనాథుడు, అభాగ్యుడు అయిన రాందాసు, ధర్మారావు సహాయంతో పెరిగి పెద్దవాడవుతాడు. ధర్మారావుకున్న ఇద్దరు కుమార్తెలను స్వంత చెల్లెళ్ళకన్నా ఎక్కువగా చూసుకుంటూంటాడు. విషవలయంలో చిక్కుకుని ధర్మారావు, అతని భార్య శోభ కన్నుమూస్తే, చిన్నాభిన్నం అయిన ఆ కుటుంబాన్ని ఆదుకొని తీర్చిదిద్దుతాడు. రత్నాలు తోడు, సులేమాన్ అండదండలతో విద్యావంతుడై, తాను కార్మికుడుగా చేరిన ఫ్యాక్టరీలోనే పెద్ద హోదా సంపాదించి, క్రమేపీ తానే ఒక భారీ పరిశ్రమ నెలకొల్పగలిగిన రాందాసుగా ఒక సమగ్ర పాత్రను అపూర్వంగా పోషించారు చంద్రమోహన్,'' అన్నారు నిర్మాత వాశిరాజు ప్రకాశం. ఈయన గతంలో నిర్మించిన ''కాలం మారింది'' శతదినోత్సవ చిత్రానికి స్వర్ణ నంది అవార్డు, మద్రాసు ఫిలిమ్ ఫాన్స్ అసోసియేషన్ బహుమతితోపాటు, విదేశీయుల ప్రశంసలూ లభించాయి. చిత్రీకరణ పూర్తయిన ''బొమ్మలకొలువు'' వన్నెల చిత్రంలో కవిత, జయమాలిని, కాంతారావు, ఈశ్వరరావు, త్యాగరాజు, ప్రసాద్‌బాబు, సత్యేంద్రకుమార్, గోకిన రామారావు, పల్లవి, రాజ్‌బాబు తక్కిన పాత్రధారులు. కొమ్మినేని స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో ఎస్. ఎస్. మూర్తి ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

తరువాతి చిత్రం ''తెలుగుతల్లి'' గురించి చెబుతూ వాశిరాజు ప్రకాశం ''తెలుగు సాహిత్య చారిత్రిక, జానపద కళావైదుష్యాన్ని చాటి చెప్పేందుకు విశిష్ట పంథాలో రూపొందించ బోతున్నాం. డిసెంబర్‌లో షూటింగ్ ప్రారంభం. పూర్తిగా మన రాష్ట్రంలోనే చిత్రీకరించ బడుతుంది. బొల్లిముంత శివరామకృష్ణ రచయిత. ఎస్. రాజేశ్వరరావు స్వరకర్త. విదేశీయులను సైతం ఆకర్షించే రీతిలో ఈ చిత్రాన్ని రూపొందించాలన్నది మా ప్రయత్నం,'' అన్నారు.

'ప్రియబాంధవి'లో శారద

## మండపేటలో "మంగళగౌరి"

శారద మూగ—చెవిటి పాత్రను పోషిస్తున్న శ్రీ అయ్యప్ప ఫిలిమ్స్ ''మంగళగౌరి'' వన్నెల చిత్రం తాలూకు రెండవ షెడ్యూల్ రాజమండ్రి సమీపంలో ఉన్న మండపేట, మేడపాడులాక్, కోనసీమలోని బోడసకుర్రు రేవువద్ద జరిగింది. మురళీమోహన్, సుభద్ర, హేమసుందర్, రాజ్‌బాబు, పి. ఎల్. నారాయణ, గిరిజ ముఖ్య పాత్రధారులు. వీటూరి సంభాషణలకర్త. చక్రవర్తి సంగీత దర్శకుడు. పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు. శిల్పంతో పాటు నిర్మాణ పర్యవేక్షణను కొండపనేని రామలింగేశ్వరరావు నిర్వహించారు. గిరిధర్ దర్శకత్వంలో హరిరెడ్డి నాగేశ్వరరావు, ఎం. నరసింహారావు నిర్మాతలు.

'దేవుడు మామయ్య'లో వాణిశ్రీ







'ధర్మయుద్ధం'లో
రజనీకాంత్, శ్రీదేవి

# సినిమా

## చిరంజీవి చిత్రాలు

''ఆశీర్వదించండి,'' అన్నాడు చలాకీ హీరో చిరంజీవి.

''మీ పేరే చిరంజీవి. ఇంకా మీకు ఆశీస్సు లెందుకు ?'' అన్నాను.

''నేనొక తమిళ చిత్రంలో నటిస్తున్నా నండోయ్. కె. ఆర్. విజయ సరసన హీరోగా 'పెరియవీట్టు సమాచారం' అనే చిత్రంలో నటిస్తున్నా. యోగానంద్‌గారు డైరెక్టరు.''

విలన్ పాత్రలూ, హీరో పాత్రలూ ధరిస్తున్న ఈ చిరంజీవి స్వస్థలం కూడా విలన్ పాత్రలు ధరించి, ఆ తర్వాత హీరో అయిన కృష్ణంరాజు స్వగ్రామమే (మొగల్తూరు). నరసాపురంలో బి.కామ్ వరకు చదివి 'కామ్'గా ఉండకుండా ఐ. సి. డబ్ల్యు చదువుతూ, ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు. తొలుత బుక్ అయిన చిత్రం ''పునాదిరాళ్ళు'' ఐతే, ముందు విడుదలైనది క్రాంతికుమార్ చిత్రం ''ప్రాణం ఖరీదు''. ఇందులో హీరో. ''మన ఊరి పాండవులు''లో ఒకరుగా, ''కుక్క కాటుకు చెప్పుదెబ్బ, ఇది కథ కాదు'' చిత్రాలలో విలన్‌గా, ''ఐ లవ్ యు, అగ్ని సంస్కారం'' చిత్రాలలో హీరోగా నటించాడు. ''కోతల రాయుడు (సెప్టెంబర్), జాతర (అక్టోబర్), చండీప్రియ (నవంబర్), కాళి (జనవరి)'' విడుదల కానున్నాయి. గౌరీ కంబైన్స్, రవి చిత్ర, అన్నపూర్ణా సినీ ఎంటర్‌ప్రైసెస్, సౌమ్య సినీ ఆర్ట్స్, చరిత ఆర్ట్స్ సంస్థలు త్వరలో ప్రారంభించే చిత్రాలలో ప్రధాన పాత్రధారి. ఇంకా బి. ఎస్. నారాయణ, పి. సుబ్రహ్మణ్యం, దవళ సత్యం దర్శకత్వం వహించే చిత్రాలలోనూ చిరంజీవి ఉన్నాడు. ఇతనికి విదేశయానయోగం కూడా అప్పుడే ఏర్పడింది. ఎస్. వి. ఎస్. వారు తెలుగు, తమిళ భాషల్లో తీసే ''లవ్ ఇన్ సింగపూర్''లో రంగనాథ్‌తోపాటు ఇతనుకూడా హీరో. అక్టోబర్ 25 నుంచి సింగపూర్, హాంకాంగ్, బాంకాక్‌లలో షూటింగ్ జరుగుతుంది. ''నాకు విప్లవనాయకుడుగా, ఏంటీ హీరోగ, డైనమిక్ విలన్‌గా, అమాయకపు పల్లె యువకుడుగా, హాస్య పాత్రధారిగా కూడా నటించాలని ఉందండోయ్!'' అంటూ, ''తథాస్తు — అని ఆశీర్వదించండి,'' అని నా కుడిచెయ్యి తీసి తన తలమీద ఉంచుకొని, ''ఇక నే వెళ్తానండోయ్. షూటింగ్ ఉంది,'' అంటూ నా జవాబుకు ఎదురు చూడకుండానే హడావిడిగా తన ఫియట్ కారులో తుర్రుమన్నాడు చిరంజీవి.

## "భలే కృష్ణుడు"

కృష్ణ, జయప్రద నాయకా నాయికలుగా విజయా క్రియేషన్స్‌వారు రూపొందించే ''భలే కృష్ణుడు'' వర్ణచిత్రానికి కె. ఎస్. ప్రకాశరావు పుత్రులు కె. కృష్ణమోహన్ రావు నిర్మాత, కె. రాఘవేంద్రరావు దర్శకుడు. సంగీత, సత్యనారాయణ, నాగభూషణం, అల్లు రామలింగయ్య, అంజలీదేవి, హలం తక్కిన తారాగణం. జంధ్యాల, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, కోటగిరి గోపాలరావు వగైరా సాంకేతిక వర్గం. సెప్టెంబర్ 22 నుంచి 26 వరకు జరిగే చివరి షెడ్యూల్‌తో చిత్రం పూర్తవుతుంది.

## బుచ్చిబాబుగా ఎ. ఎన్. ఆర్.

ఎ. ఎన్. ఆర్. పుట్టినరోజు — సెప్టెంబర్ 20న అన్నపూర్ణ స్టూడియోలో ఎ. ఎ. కంబైన్స్ ప్రారంభించే ద్వితీయ చిత్రం ''బుచ్చిబాబు''లో ఎ. ఎన్. ఆర్. సరసన జయప్రద నాయిక. చక్రవర్తి సంగీత దర్శకుడు. దాసరి నారాయణరావు దర్శక సారథ్యంలో రూపొందుతుందీ వన్నెల చిత్రం.

## "శ్రీరామబంటు" — హిందీలో

''శ్రీరామబంటు — చిత్రాన్ని హిందీలో తీయబోతున్నాము. అక్టోబర్‌లో షూటింగ్ ప్రారంభమౌతుంది,'' అన్నారు నిర్మాత వై. వి. రావ్. హైదరాబాద్‌లో తయారయ్యే ఈ చిత్రానికి ఎస్. ఎస్. లాల్ ఛాయాగ్రాహకుడు. ఎస్. డి. లాల్ దర్శకుడు.



'నాయిల్లు - నావాళ్లు' చిత్రంలో
మురళీమోహన్, డా॥ పాండురంగశాస్త్రి, శ్రీధర్

దాసరి నారాయణరావు




నిర్మాత: వడ్డే శోభనాద్రి * నిర్వహణ: వడ్డే రమేష్

'శివమెత్తిన సత్యం'లో ఒక దృశ్యం

# సినిమా

## "అమెరికా రాముడు"లో అమెరికా నటులు

పాతూరి వెంకటరత్నం తెలుగులో సమర్పించే, శ్రీ నందన సరసిజ మూవీస్ ''అమెరికా రాముడు'' రంగుల చిత్రంలో కె. ఆర్. విజయ, సీమ, విదుబాల, జై శంకర్, రవికుమార్, పద్మినితోపాటు అమెరికన్ నటులు జోయ్ వడ్డింగ్టన్, హెన్రీమార్షల్ పాల్గొన్నారు. అమెరికాలో తయారయింది చిత్రం. పట్స్‌బర్గ్‌లో పాలరాతితో నిర్మించబడిన శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం, నయాగరాఫాల్స్, మియామీబీచ్, కెన్నెడీ ఏర్‌పోర్ట్ వగైరా ప్రాంతాలలో చిత్రీకరించారు. రాజశ్రీ రచయిత. విశ్వనాథన్ సంగీత దర్శకుడు. రామచంద్రబాబు ఛాయాగ్రాహకుడు. పాతూరి మధుసూదనరావు నిర్మాత.

## అమృత ఫిలిమ్స్‌లో ఎం. ఎస్. విశ్వనాథం

కృష్ణ, శ్రీదేవి ప్రధాన జంటగా బి. వి. ప్రసాద్ దర్శకత్వంలో త్వరలో సెట్స్‌కు వెళ్లే చిత్రానికి ఎం. ఎస్. విశ్వనాథం సంగీత దర్శకుడు. ''అప్పుడప్పుడు సాంకేతిక నిపుణుల్లో కాస్త కూస్త మార్పుదలావుంటే వెరైటీగా వుంటుందని విశ్వనాథంగారిని బుక్ చేశాం. అలాగే డి. వి. నరసరాజుగారు తొలిసారిగా మాకు స్క్రిప్టు రాస్తున్నారు,'' అన్నారు అమృత ఫిలిమ్స్ తాజా రంగుల చిత్రాన్ని సమర్పించే కథకుడు, నటుడు మన్నవ బాలయ్య.



'ముద్దా—ముచ్చట'లో మురళీమోహన్, గీత



'భలే కృష్ణుడు'లో జయప్రద, కృష్ణ

## మా ఊరి దేవతలో నరరూప రాక్షసులు

హాల్లో వాలుకుర్చీలో వయసు మళ్ళిన రాఘవయ్య (ప్రభాకరరెడ్డి) కూర్చొని, సిగరెట్ కాలుస్తూ తాపీగా దినపత్రిక చదువుకుంటున్నాడు. ఇంతలో ఇన్‌స్పెక్టర్ రఘు (రంగనాథ్) వచ్చి, "నా పేరు రఘు," అన్నాడు. రాఘవయ్య తల ఎత్తకుండానే "అలాగా ?" అన్నాడు.

"నిన్న రాత్రి జరిగిన ఘోరాల గురించి ఎన్‌క్వయిరీ చెయ్యడానికి వచ్చాను"

"ఓహో !" అన్నాడు రాఘవయ్య చదవడం మాని.

"మీబోటి పెద్దవాళ్ళుండగా ఈ ఊళ్ళో ఇలాంటి దారుణాలు జరగడం అన్యాయం."

"కక్షలూ, కావేషాలూ పెరిగి – కలికాలం కాష్టంలా కాలేకంటే, ఎప్పటికప్పుడు ఇలా తేల్చుకోవడమే మంచిది."

"మీరే అలా అంటే యెలా ? ఎవరిమట్టుకు వాళ్ళు చట్టాన్ని చేతుల్లోకి తీసుకోవడం తప్పు కాదంటారా ?"

"తప్పు మీకు తెలుసు. నాకు తెలుసు. తక్కినవాళ్ళకు తెలియదుకదా ?"

"నిజమే. చనిపోయినవారి గురించి వివరాలేమైనా చెప్పగలరా ?"

"చెప్పడానికేముంది? ఆ నలుగురిలో ఇద్దరు ఈ ఊళ్ళోవాళ్ళు. ఇద్దరు పొరుగూరు వాళ్ళు. తాగి కొట్టుకున్నంటారు ... చచ్చారు..."

"అంతే అంటారా ?"

"అంతకుమించి తెలుసుకోవాలంటే ఊళ్ళో కెళ్ళి తెలుసుకోవలసిందే."

"నేనే వెళ్ళి తెలుసుకొస్తాను," అంటూ రఘు బయలుదేరాడు.

రామకృష్ణా ఫిలిమ్స్ "మా ఊరి దేవత" చిత్రాన్ని సమర్పించే ఎం. రామకృష్ణారెడ్డి ఈ సన్నివేశం గురించి వివరిస్తూ, "రామాపురంలో మకుటంలేని మహారాజులుగా చెలరేగే కామందులు రాఘవయ్య, మాధవయ్య అకృత్యాలకు అంతులేదు. మాధవయ్య ముద్దుల కుమారుడు కామరాజు పశుత్వానికి ఎందరు యువతులు బలి అయ్యారో! తత్ఫలితంగా నోళ్ళు నొక్కుకుని కాలే కడుపుతో కిక్కురుమనకుండా బ్రతికే అమాయక ప్రజల జీవితగమనంలో సంచలనం చెలరేగింది. కామందుల బంగళాలో నాలుగు రాత్రులు వరుసగా కొందరు పాముకాటువల్ల మరణించారు. ఈ చావులకు కారణం పామేనా లేక మరేమైనా వుందా – అనే చిక్కుసమస్యను విడదీసే బాధ్యత ఆ ఊరికి కొత్తగా పోస్టు చేయబడ్డ ఇన్‌స్పెక్టర్ రఘు మీద పడింది," అన్నారు. ప్రభ, మోహన్‌బాబు, కాంతారావు, రాజనాల, హరిబాబు, జై భాస్కర్, లక్ష్మీకాంత్, సి. హెచ్. కృష్ణమూర్తి, కె. కె. శర్మ, పల్లవి, సత్యకళ, వసంతి తక్కిన తారాగణం. గిరిధర్ దర్శకత్వంలో మొలకల సుబ్బరామిరెడ్డి, ఎం. ప్రభావతమ్మ ఈ చిత్రాన్ని నిర్మించారు.

## "పల్లెటూరు"

ఎన్. టి. ఆర్. శుభాశీస్సులతో సినిమాలయ ఆర్ట్ పిక్చర్స్ ప్రారంభించిన "పల్లెటూరు" వర్ణచిత్రానికి ఆగస్టు 29న భరణీ స్టూడియోస్‌లో తొలి పాట రికార్డు చేయబడింది. ఎస్. రాజేశ్వరరావు సంగీత దర్శకుడు. పసుపులేటి శ్రీనివాస్ దర్శకుడు.

## "సమాధి కడుతున్నాం - చందాలివ్వండి"

శ్రీ వాసవీ ప్రొడక్షన్స్ వారి పై వర్ణచిత్రం షూటింగ్ ఇటీవల నెల్లూరు సమీపాన గల విడవలూరులో జరిగింది. నూతన్ ప్రసాద్, నాగభూషణం, శివకుమార్, పి. ఎల్. నారాయణ, చిట్టిబాబు, రాళ్ళపల్లి, సి. హెచ్. కృష్ణమూర్తి, కె. విజయ, జయరేఖ, జయమాలిని, నిర్మల పాత్రధారులు. పరుచూరి, జె. వి. రాఘవులు, కె. ఎస్. ప్రసాద్, దిలీప్‌సింగ్ – రచన, సంగీతం, ఛాయ, శిల్పం శాఖలను నిర్వహిస్తున్నారు. అడ్డగిరి బసవపున్నారావు, చింతలపూడి విఘ్నేశ్వరరావు సహనిర్మాతలు. గూనా నాగేంద్రప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో మాలి రంగయ్య, పులిపాటి వెంకటేశ్వర్లు ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు.

'లంబాడోళ్ల రాందాసు'లో





'వినాయక విజయం'లో ఒక దృశ్యం

## సినిమా

### ఇరుగు - పొరుగు

★ దర్శకుడు ఎ. వి. శశి తొలుత కళాదర్శకుడుగా సినిమా రంగంలో ప్రవేశించాడు.

★ మద్రాసు మిడ్‌లాండ్ థియేటర్‌లో కె. బాలచందర్ తమిళ చిత్రం "మన్మథలీల" ప్రదర్శింపబడే రోజుల్లో - అది 'ఎ' సర్టిఫికేట్ చిత్రం అవడంవల్ల ఒక యువతికి ప్రవేశం లభించలేదు. ఆ అమ్మాయి కోపంతో తను కొన్న టిక్కెట్టును అక్కడే చించివేసింది. రెండేళ్ళ తర్వాత అదే థియేటర్‌లో బాలచందర్ తీసిన మరో 'ఎ' చిత్రమే ప్రదర్శింపబడుతున్నప్పుడు ఆ యువతి చూడగల్గింది. ఆ చిత్రం "తప్పుతాళంగళ్". ఆ యువతే అందులో నాయిక. ఆమె సరిత.

★ "డ్రాకులా - చిత్రాన్ని మద్రాసులో చూడలేకపోయాను - అప్పుడు నా వయసు తక్కువ అవడంవల్ల. ఆ భయానక చిత్రాన్నే ఇటీవల రోమ్‌లో చూశాను. ఆ రాత్రంతా నాకు నిద్ర పట్టలేదు," అంది జయచిత్ర.

★ బాసు ఛటర్జీ దర్శకత్వం వహించే ఒక హిందీ చిత్రం పేరు "!!!!"

★ విఖ్యాత హాలివుడ్ నటుడు - గాయకుడు స్వర్గీయ ఎల్విస్‌ప్రెస్లీ ఉపయోగించిన ఒక జెట్ విమానం ఇప్పుడు అమ్మకానికి ఉందట. ఈ విమానంలో ఒక కాన్ఫరెన్స్ రూమ్, రెండు పడక గదులు, ఒక డ్రస్సింగ్ రూం, షవర్ ఉన్న బాత్‌రూమ్ వగైరాలున్నాయి. దీని వెల 30 కోట్ల రూపాయలు.

★ సుభాష్‌చంద్రబోస్ వేషం వెయ్యాలని శివాజీగణేశన్‌కు చిరకాల వాంఛయట.

★ చలన చిత్రాలకు 'ఎ' సర్టిఫికేట్ 1918 నుంచి అమలులోకి వచ్చింది.

★ "నాట్యకళ" గురించి ఒక పత్రికను నడపాలని ఉందట వెన్నిరాడై నిర్మలకు.

★ సుప్రసిద్ధ హాలివుడ్ హాస్య నటుడు బాబ్‌హోప్ వయస్సిప్పుడు 70. ఇప్పుడు సరిగ్గా నడవలేడు. అడపా దడపా కొన్ని టి. వి. కార్యక్రమాలలో మాత్రం పాల్గొంటున్నాడు. విడాకులు పొందని బహు కొద్దిమంది హాలివుడ్ నటులలో ఇతనొకడు. "మీ 45 ఏళ్ళ వైవాహిక జీవితం సాఫీగా సాగిపోవడానికి కారణమేమిటి?" అని ఒక విలేఖరి అడిగాడు. అందుకు ఆ హాస్య నటుని జవాబు : "ఇందులో విచిత్రమేముందీ? ఏడాదికి ఏ రెండు మూడు వారాలో మాత్రమే నేను మా కుటుంబంతో కలిసి ఉండేవాడ్ని."

★ ఇప్పుడు కొన్ని దక్షిణాది చలన చిత్రాలు విదేశాలలో తయారవుతున్నట్లుగా ఘనంగా ప్రకటనలు వెలువడుతున్నాయి. కాని, దాదాపు 42 ఏళ్ళకు ముందే "నవ యువన్" అనే తమిళ చిత్రంలోని కొన్ని భాగాలు లండన్‌లో చిత్రీకరించబడ్డాయి.


జయకృష్ణా పిక్చర్స్





అల్లావుద్దీన్
అద్భుతదీపం
సినిమాస్కోప్-ఈస్ట్‌మన్‌కలర్



# ఆపద్ధర్మం

ఎమ్.డి.సౌజన్య

"ప్రపంచంలో అన్నింటికంటే తేలికైంది 'అది చెయ్ ... ఇది చెయ్' మనటం! అన్నింటికంటే కష్టమైంది - అలా చేస్తున్నప్పుడు వచ్చే అపాయాన్ని ఉపాయంగా తప్పించటం!" అంటారు-ఆర్యులు.

ఆయితే!!...

భోజరాజుకు — కాళిదాసులా; అక్బర్‌కు — బీర్‌బల్‌లా; రాయలవారికి — రామలింగడులా; తైమూర్‌కి - నాసిరుద్దీన్ లాంటి వాళ్ళు దొరకటం — తిమ్మిని బొమ్మిని చేయటం, సమయానుకూలంగా ప్లేట్లు ఫిరాయించగలగటం— అప్పటి కట్టుకథల్లో మాటేగాని, ఇప్పటిరోజుల్లో అసంభవమంటారు!

కాని...!!

'భగత్‌సింగ్ హైస్కూల్' హెడ్మాస్టరు నూకరాజుగారికి మాత్రం — భజగోవిందం మేష్టారు — చేతిలో బెత్తంలా, పొడుంకాయలో చూర్ణంలా, పెన్నులో యింకులా, బుగ్గలో ఖారాఖిళ్లీలా, భుజంమీది పైపంచెలా, తలలో నాలికలా, కాలికింది చెప్పులా, అయిపోయాడు!

భజగోవిందం మేష్టారు - స్కూలు ప్రెసిడెంట్ దశావతారంగారికి, మందుసీసాలు అందించటం దెగ్గరనుంచి మొదలుపెట్టి ప్యూను పానకాలు రాకపోతే బెల్లు కొట్టేవరకు గల అమాంబాపతు పనులన్నీ జమిలిగా చేయటంతో, చెప్పే పనికి, చెప్పబోయే పనికి "యస్సార్! యస్సార్!" అంటూ అరిగిన రికార్డులా అరుస్తుండటంతో 'భజగోవిందం' కాస్తా 'భజన గోవిందం'గా సార్థకనామధేయుడయ్యాడు.

ఇలా వుండగా ఒక శుభదినాన, స్కూలు ప్రెసిడెంట్ అవతారంగారు, ఎమర్జెన్సీ మీటింగు ఒకటేసి — ప్యూను పానకాలుని, హెడ్‌మాస్టరు నూకరాజుని, భజ(న) గోవిందాన్ని పిలిచి "ఇదో ఎడ్డుమేట్రూ! రేపొచ్చే రెపబ్లిక్కుదినానికి మన బళ్ళో గ్యాంధీ యిగ్రం, మొండెం సైజది, యిన్‌కంటాక్సు ఆపీసరుసేత ఆయిష్కరిద్దాం! పూరిమీద పడి సందా లొసూలుసేసి పని కానివ్వండి! గ్యాందుగుండాలి! నా పేరు సందాల పనిలో పైకి పొక్కకూడదు!" అన్నాడు హెడ్‌మాస్టరు భుజాలమీద భారం మోపుతూ.

అవతారంగారి ఆజ్ఞ, సుగ్రీవాజ్ఞ — అని అందరికీ తెలుసు! అందుకే త్రిమూర్తుల్లా ముగ్గురూ "ఎస్సార్! ఎస్సార్" అన్నారు, చేతులు నలుపుకుంటూ, వినయంగా.

అవతారంగారటు పోగానే హెడ్మాస్టరు తన హెడ్‌మాస్టరునని గుర్తు రాగానే — "మిస్టర్ భజగోవిందం — పిల్లల యడ్మిషన్సులో నేనేదో సంజాతున్నానని, గుంజాతున్నానని, లోపాయకారీ చందాలు వసూలుచేశాననీ, నామీద యిప్పటికే కలెక్టరు దెగ్గరనుంచి పార్లమెంటుదాకా పిటీషన్లు ఏడిచాయి! కాబట్టి యీ చందాలపని — నువ్వూ-పానకాలూ జమిలిగా వసూలుచేసుకోండి!" అన్నాడు.

పానకాలు కళ్ళు ఆనందంతో మెరిశాయి. మళ్ళీ ఎప్పుడో 'జన్మకో శివరాత్రి' అన్నట్లు వచ్చే అవకాశం, సద్వినియోగం చేసుకోవాలని "చిత్తం! చిత్తం! మీ మాట నేనెలా కాదంటాను... అలాగే వసూళ్ళు సేత్తాను! అయితే డూటీమీద పోయినట్లు మమ్మల్నెవ్వరినీ వదలండి, రేపే మొదలెడతాను!" అన్నాడు తెచ్చికోలు వినయం నటిస్తూ.

రెండవరోజు ఉదయమే ప్యూను పానకాలు, భజగోవిందంను, 'భారతమాత హెయిర్ కటింగ్ సెలూన్'కి తీసికెళ్ళి సింగిల్ టీ యిప్పించి, "పంతులూ! మన ప్రెసిడెంటు దశావతారంగాడు గ్యాంధీ యిగ్రం మన బళ్లో ఏయించటంలో బలే రిటిగేసనుంది! గ్యాంధీగారూ, మన అవతారంగాడూ, ఇన్‌కమ్‌ట్యాక్సు ఆఫీసరూ — ఒకటే క్యాస్టు! పదిలక్షల సినిమాహాలొకటి కడుతుండాడుగా అవతారం! ఆడి జోలికి యిన్‌కంటాక్సోళ్ళు రాకుండా, కుక్క నోటికి బెల్లంముక్క అందిచ్చినట్టు, యీ గ్యాంధీ యిగ్రం అడ్డం పెడుతుండాడు. ఎంతసెడ్డా అల్లూ అల్లూ వొకటేగదా!" అన్నాడు గీతోపదేశం చేసినట్టు.

భజగోవిందానికి, పానకాలు పచ్చి రౌడీ అనీ, ప్రెసిడెంట్ అవతారం నుంచి — ప్రతి పంతులు దెగ్గరా ప్రతిరోజూ దసరా మామూళ్ళు వసూలు చేస్తాడని, ఇందులో స్వపరభేదం లేదని,






# ఎల్లప్పుడు చైతన్యంగా
# ఎల్లప్పుడు చురుకుగా

మీ బాబు పెరుగుతున్నప్పుడు, అతను నిరంతరం అరవంగా శక్తి వినియోగిస్తూ ఉంటాడు.

మీ బాబుకు శక్తినిచ్చే రుచికరమైన, పాలతో తయారైన మాల్ట్ చాకొలెట్ పానీయం బూస్ట్. ఎందుచేతనంటే బూస్ట్, సంపూర్ణమైన మీగడ పాలు, గోధుమ, బార్లీ మాల్ట్ మరియు కాకోతో తయారైనది.

మీ బిడ్డకు శక్తినిచ్చే ఈ ఇంధనాన్ని ఇవ్వండి. అది అతను రోజంతా, ప్రతి రోజు కూడా చురుగ్గా, చైతన్యవంతంగా ఉండేటట్టు చేస్తుంది.






D-5621 T 4

## చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## బూస్ట్
మాల్ట్ చాకొలెట్ మిల్క్ డ్రింకు

# ఆపద్ధర్మం

గడియ రవు ఎళ్ళని ఖాతరు చేయకుండా కష్టంవచ్చినప్పుడు వచ్చిపోయే స్వేచ్ఛాప్రియుడని, అంతస్తు, హోదాలు పట్టించుకోని పచ్చి త్రాగుబోతని తెలుసు!

కాని, ఇంత లోతైన మనిషిని, ఆ బుర్రమీసాల వెనక, గుబురులాంటి కనుబొమల వెనక యింత గొప్ప అవగాహన, వ్యూహశక్తి వుందని కలలో కూడా ఊహించలేకపోయాడు.

"బజగోవిందంగారూ! ఈమధ్య జనంలో క్యాస్టు ఫీలింగు మరీ పెరిగిపోతోంది కాబట్టి నాలుగు కేస్టులోళ్ళు నాలుగు సందాలెయ్యాలంటే మనం నాలుగు కేస్టులకు సెందిన గ్యాందీ, నెర్రూ, అంబేర్కార్, మౌలానా అజాద్‌ల పేర్లు సెప్పాల" అన్నాడు

భజగోవిందానికి మతిపోయి "మనం పెయించబోయేది ఒక్క గాంధీగారి విగ్రహమేగా? మరి నలుగురు జాతీయ నాయకుల పేర్లు చెబితే ఎలా?" అన్నాడు, అయోమయంగా.

"బలేవాడివయ్యా పంతులూ! జాతీయ నాయకులే సెప్పింది సేయలేకపోయారు! ఇక మనమెంత, మన బలగమెంత! డబ్బు వసూలయ్యేదాక నాలుగు కేస్టుల నాయకుల పేర్లు సెప్పేది! అంతగా గిట్టనోడు యివరాలడిగితే మన యిస్కూలు నాలుగు దిక్కుల్లో నాలుగు యిగ్గాలు ఏయిత్తుండామనీ, పెస్తుతం గ్యాందీ యిగ్గం, రిపబ్లిక్‌డేకి ఏయిత్తుండామనీ, ఆంధ్ర రాష్ట్రావతరణంరోజు వొకటీ, ఇండిపెండెన్సు దినాన ఒకటి, పంతుళ్ళ దినాన వొకటి పెయిత్తామని సెబుదాం!" అన్నాడు, గారపళ్ళల్లో తాజ్‌మహల్ బీడీ యిరికించుకుంటూ, నవ్వి

భజగోవిందానికి మతిపోయి, వళ్ళు చల్లబడి పోయింది

"మీకు కొత్తకాబట్టి భయపడిపోతుండారు గాని పంతులుగారూ! మీకెందుకు, నేసెప్పినట్టు సేయండి ఏ పేచీ వుండదు. ఈడ గిమ్మత్తేద్దంటే, యీ యిగ్గాలకోసం సందా 'సేసేవోళ్ళు– పావలా– అర్దాకంటే సందాలియ్యరు! కాబట్టి, తరువాత మనం అసలిగ్గాలు ఏశామా లేదా అనేది యీళ్ళ కెవళ్ళకీ పట్టదు! అయినా వసూలయినదాంట్లో సగం అవతారానికీ, అందులో సగం యెద్దుమేట్టరు కడుపులోకి సర్దుకుంటె, యింకా యిగ్గం లేసేదెక్కడ? పాపిష్టిజన్మ కాకపోతే–నోరాళ్ళది పెద్దపేరు మనదీ!" అన్నాడు, పానకాలు బాధగా బీడీ పొగ ముక్కుల్లోంచి వదలి

తరువాత జాతీయ నాయకుల పేర్లు చెబుతూ చందాలు వసూలుచేస్తున్నప్పుడు, పానకాలు చెప్పినట్లే ఏ కులంవాళ్ళు ఆ కులం నాయకుడికి మాత్రమే చందాలు వేశారు చదువుకోనివాళ్ళకంటే చదువుకున్నవారిలోనే ఈ కులాభిమానం హెచ్చుగా కనిపించింది పెద్దలకంటే పిన్నల్లోనే యీ జాడ్యం వెర్రితలలు వేసినట్టు కనిపించటం భజగోవిందానికి మరీ ఆశ్చర్యం కలిగించింది.

"జాతీయ నాయకులంతా, తమ తమ కులాల, మతాల విషయాలు మరచి, అవి పోవాలని, భావిభారత పౌరులంతా ఆదర్శప్రాయులైన ప్రపంచ పౌరులు కావాలని కంకణాలు కట్టుకొని పోరాడితే, యిప్పటివాళ్ళంతా, ముఖ్యంగా యువతరం — జాతీయ నాయకుల్ని తమ తమ కులాల, మతాల, ప్రతినిధులుగా గుర్తుపెట్టుకోవటం ఏమిటి?" — అనే ప్రశ్న భజగోవిందం మెదడుని, యక్షప్రశ్నలా తొలచటం ప్రారంభించింది

తరువాత నానాగడ్డికరచి, నాలుగు విగ్రహాలకి నాలుగువేలు పోగుచేసినప్పుడు తెలిసిన మరో విషయం ఏమిటంటే చందాలు వేసినవాళ్ళు జాతీయ నాయకులమీది భక్తికంటే రౌడీ పానకాలును, వాడి బుర్రమీసాలను, నిప్పుకణికల్లాంటి వాడి వాలకాన్ని చూసి, 'రౌడీ వెధవ! వాడితో మనకు పేచీ ఎందుకు ఏదో ఇచ్చి పంపుదాం" — అన్న భయమే, ఎక్కువ పని చేసినట్టు కనిపించింది చందాల పని పూర్తయ్యి యిక విగ్రహం ఆర్డరివటమే ఆలస్యం! అనుకుంటుండగా, ఒకరోజు, పానకాలు తప్పతాగి భజగోవిందం యింటికొచ్చి "ఇదిగో పంతులూ! గ్యాందీ యిగ్గం సంగతి నేను సూసుకుంటుండా! రేపు, టేజీ, మైకు, షామియానాం పని నువ్వు సూడు!' అన్నాడు

"పోనీ పీడావదిలింది! లేకపోతే ముష్టి మూడొందలకి సిమెంటుతో గాంధీ విగ్రహం బస్ట్‌సైజ్ చేసేదెవరు?" అనుకున్నాడు భజగోవిందం ఆ కార్యభారం, పానకాలు తీసుకున్నందుకు సంతోషిస్తూ.

* * *

అనుకున్నరోజు అనుకున్నట్లుగా, నాలుగడుగుల దిమ్మెమీద దుప్పటి కప్పిన విగ్రహం 'భగత్‌సింగ్' హైస్కూల్ ఆవరణలో వెలిసింది

చివరి నిముషంలో ఇన్‌కంట్యాక్సు ఆఫీసరు అనుకోకుండా హైదరాబాద్ పోవటంతో కొత్తగా తాసీల్దార్‌గా ప్రమోట్ అయిన డిప్యూటీ తాసీల్దార్, అధ్యక్షత వహించాడు. ఆయన పొట్టి సంతకాలకు అలవాటుపడ్డ పొట్టివాడు కావటాన, "మహావిద్యార్థులారా — పంతుళ్ళారా! మా దొరగారు — కలెక్టర్‌గారు రావల్సిన ఘంతను' అదృష్టంకొద్దీ ఈ కార్యక్రమం దశావతారంగారి మాట తీసేయలేక నేనొప్పుకున్నా! మన జాతిపిత గాంధీగారి విగ్రహం ఇది! అందుకని అంతా "బోలో స్వతంత్ర భారత్‌కి — జై! మహాత్మా గాంధీకీ — జై!" అని అరవండి" — అంటూ తాసీల్దారు దుప్పటి తొలగించాడు. పిల్లలు పెద్దలు "మహాగాంధీకీ జై" — అంటూ అరుస్తూ ఒక్కసారి ఆగిపోయారు!

అంతే!

ఆశ్చర్యం!!

ఎవరి మోహానా నెత్తురుచుక్కలేదు!

"ఏందిది ఎడ్డుమేట్రూ!" అన్నాడు దశావతారం తన ప్రక్కనేవున్న ఆయన్ని మోచేత్తో డొక్కలో కుమ్మి!

హెడ్‌మేష్టర్ నూకరాజు ఆముదం త్రాగిన ముఖంతో "ఏమిటో సార్! అంతా మాయగా వుంది?" అన్నట్లు, ముఖం మాడ్చుకుని, భజగోవిందం వైపు చూశాడు, పురిమినట్టు!

అంతవరకు స్టేజి ప్రక్కన పిల్లల్ని సర్దుతున్న భజగోవిందం, సిమెంటు దిమ్మెమీది విగ్రహం చూసి అదెవరిదో గుర్తురాక, నెత్తిన పిడుగు పడ్డట్టు అదిరిపడ్డాడు!

ఆ విగ్రహం ఎవరిదో గుర్తుపట్టటానికి కళ్ళజోడు సర్దుకుంటున్నాడు తాసిల్దారు!

పుస్తకాల్లో తమకు కనిపించే బట్టతలా, బోసినోరు, కళ్ళజోడు, కనబడక — అవి ఆ విగ్రహంలో ఎక్కడున్నాయో తెలుసుకోవాలని వెతుకుతున్నారు, పిల్లలు

చీమ చిటుక్కుమంటే వినిపించే నిశ్శబ్దం!

ఇక మార్గాంతరంలేక హెడ్మాస్టరు నూకరాజు "మహాజనులారా! ఈ గాంధీ విగ్రహాన్ని తయారు చేయించింది మన భజగోవిందంగారు! ఆయన ఈ విగ్రహానికి సంబంధించిన వివరణ చెబుతారు!" అన్నాడు, తన పాపభారమంతా, పాపలభైరవుడు భజగోవిందం మీదకు నెడుతూ

అప్పటికే చెమటలుపట్టి, నోట మాట రాక, గుండె వేగం హెచ్చి, చెవుల్లోంచి వేడిగా ఆవిరి వస్తున్న భజగోవిందం లేని ధైర్యం తెచ్చుకొని, క్షణకాలంలో తన కర్తవ్యం గుర్తొచ్చి, కోటు తొడిగి, మీసకట్టు, పెద్దచెవులు, ప్రక్కపాపటతో వున్న పాతికేళ్ళ యువకుడి విగ్రహాన్ని చూస్తూ - కన్నీళ్ళు క్రుక్కుకుంటూ "మహాజనులారా! భారతదేశంలో, గాంధీమహాత్ముడి విగ్రహాలు అనేకం వున్నాయి! కాని యిలాంటి విగ్రహం గాంధీగారిది, ప్రపంచంలో ఎక్కడా లేదనే చెప్పాలి

ఇది గాంధీగారు, ఇంగ్లాండుకు చదువుకోడానికి వెళుతున్నప్పుడు తీసిన ఫోటో ఆధారంగ చేసింది. అందుకే మనం ఇది గాంధీగారి విగ్రహం అంటే నమ్మలేకపోతున్నాము అసలు గుర్తేపట్టలేక పోతున్నాము

ఇక్కడ మనం గుర్తుపెట్టుకోవలసింది, ఎంతో అధునాతనమైన ఆంగ్ల నాగరికతను అనుకరించిన గాంధీమహాత్ముడు, తరువాత నిజమైన పేదప్రజల ప్రతినిధిగా కొల్లాయికట్టి జీవించాడో, భావిభారత పౌరులైన మీకుందరికీ తెలియాలని, ఈ విగ్రహాన్ని చూసి మీరు ప్రతిక్షణం ఆయన ఆదర్శాలను గుర్తుచేసుకోవాలనే ఈ ఏర్పాటు చేశాము!" అన్నాడు.

తాసిల్దారుతో సహా అందరూ తమ హర్షాన్ని వెలిబుచ్చుతూ చప్పట్లు చరిచారు బాలభటులు మంగళవాయిద్యాలు మ్రోగిస్తుండగా "భలే తాత మన బాపూజీ" అంటూ ఆడపిల్లలు పాటలు పాడారు తరువాత ప్యారీ స్వీట్సు పంచారు

చివరికి తెలిసిన విషయమేమిటంటే — ఎవరో లక్షాధికారి విదేశాల్లో చదువుకోసం వెళ్ళి చనిపోయిన తన ఏకైక పుత్రుడి విగ్రహాన్ని చేయిస్తే, తాగిన మైకంలో వున్న పానకాలు, రాత్రికి రాత్రి ఆ విగ్రహం ఎత్తుకొచ్చి స్కూల్లోని దిమ్మె ఎక్కించి దాన్ని జాతిపిత స్థానంలో పెట్టాడు. ఎవరి పబ్బం వాళ్ళు తెలివిగా గడుపుకుంటుంటే ఆ విగ్రహం నిశ్చలంగా వుండిపోయింది ●

ఆడుతూ వస్తోంది

# నాలికపై నడయాడే ఓ కొత్త రుచి
# తితితై తితితై.... చక్ర టీ

చిక్కనైన చిక్కదనం
మహోన్నతం రుచి, సువాసనా అత్యుత్తమం !

రసవత్తరమైన కొత్త టీ– రసికాగ్రేసరులకు–
రసికులు ఊరట్లూగే... చక్ర టీ–
నాణ్యతలో అత్యుత్తమమైన మరొక మణిపూసలాంటి
తేయాకు. కొత్త చక్ర టీ ఇదిగో–కొత్త ఉత్పాదన **చక్ర టీ**






**టాటా-ఫిన్లే**
ఉత్పత్తి

daCunha/TF/CHT/2 Tel

( గత సంచిక తరువాయి )




























[ఇంకా ఉంది]


VEP





సీరియల్

# ప్రేమపాశం

శ్రీమతి ప్రమీలా బనార్జీ

(గత సంచిక తరువాయి)

మర్నాడు సాయంత్రం [illegible] పని ముగించుకొని, ముస్తాబౌతుండగా "ఎక్కడికి ప్రయాణం?" అంది మధ్యాహ్నం మూడు గంటలకు ప్రక్కింటి [illegible] వచ్చిన తులశమ్మ.

"[illegible] అనుకున్నాను అత్తయ్యా. [illegible]'' అంది గబగబ చీరకుచ్చిళ్లు సర్దుకుంటూ.

"ఇక అయినట్టే వాడి చదువు." దీర్ఘంగా నిట్టూర్చింది తులశమ్మ.

"వంద లొందలు పోసి వాడ్ని చదివిస్తున్న చదువంతా నాశనమే. మాటలతో మంత్రించి చేసుకుంటే చేసుకున్నావు గాని సినిమా, షికార్లంటూ వాడి చదువుకు బండపడేట్టు చెయ్యకు తల్లీ. మేము కలిగిన వాళ్ళం కాదు, మరో సంవత్సరం చదివించి నీ మొగుడికి డాక్టరు పట్టా ఇప్పించేం దుకు" అని విసవిసా అక్కడి నుండి వెళ్ళిపోయింది.

"అత్తయ్యా!" దిమ్మెరపోయిన జానకి చేతిలో అద్దం జారి క్రింద పడబోతుంటే యెప్పుడొచ్చాడో మనోహర్ వచ్చి పట్టుకున్నాడు. ఆమె కండ్లలో వుబికిన కన్నీరు జారి, వంగి అద్దం పట్టుకున్న అతడి శిరస్సుమీద పడ్డాయి.

"జానకీ" అతడి పిలుపు ఆమెను యధాస్థితికి తెచ్చింది.

కొంగుతో కండ్లొత్తుకుంటూ "అరె యెప్పుడొచ్చారు?'' అంది.

అతడేం పలకలేదు.

ఆమె లోపలికి వెళ్ళి మంచినీళ్ల గ్లాసు తెచ్చి అతడి ముందు పెట్టి "కాఫీ తీసుకొస్తా'' నంటూ మళ్ళీ లోపలికి వెళ్ళింది. తనముందు బాధను దాచుకోవాలని ప్రయత్నిస్తున్నదని అతడు గ్రహించాడు.

అయిదు నిమిషాల తర్వాత కాఫీ గ్లాసు పట్టుకొచ్చిన జానకి ముఖం కడుక్కొని, మళ్ళీ తిలకం దిద్దుకొని వచ్చిందని తెలుసుకున్నాడు.

"నేను రెడీ మీదే ఆలస్యం.'' అతడు కాఫీ తాగుతుంటే, అంది చిరిపిగా.

తను గుమ్మంలోకి వచ్చినప్పుడే తల్లి అంటున్న మాటలు విన్న అతడి మనసు వికలమైపోయింది. పిక్చర్‌కి వెళ్ళాలని ఎంత ఉత్సాహంగా వచ్చాడో, అంత నిస్పృహ చెందాడు. తనవల్లే జానకి అలా అనిపించుకున్నదని బాధగా వుంది. నిజాని కిప్పుడు పిక్చర్‌కు వెళ్ళాలన్న వుత్సాహమే లేదు. కాని [illegible] మాటలతో కలత చెందిన జానకి, [illegible] మామూలుగా మారి [illegible] వెళ్ళాలనిపించింది [illegible] [illegible] బాధ [illegible]! తనను [illegible] కున్నందుకు ఎంత పశ్చాత్తాప [illegible]!

కొంత దూరం నడిచిన తర్వాత యేవో సినిమా కబుర్లు, నటీ నటుల ముచ్చట్లు చెబుతున్న జానకిని చూసి "జానకీ, నీ వ్యధ నీ మాటల్లో మరిచి పోవాలనుకుంటున్నావా?'' అన్నాడు బాధగా.



# మాజా మేలైన జీవనానికి-

ప్రపంచంలోని పెద్ద పట్టణాలలో
మీరు వాడే తరహాకి చెందిన
రుచిగలది-స్ట్రాబెర్రీ, పైనాపిల్
మరియు ఆరంజ్ రుచులలో.
చల్లటి నీటిలో కలుపండి.
వెంటనే మీకొక రుచికరమైన పానీయం తయారవుతుంది.
సుఫ్లే-లస్సీ, కాక్‌టెయిల్
మొదలైన వాటితో బాగా
కలిసి పోతుంది.




'మాజా' అతి మేలైనది. మాజా మీరెప్పుడిచ్చినా, ఇచ్చే ప్రతి ఒక్కసారి అదివక ప్రత్యేక సందర్భమనిపిస్తుంది. మీ పిల్లలు, అతిథులు దాని పండ్ల రుచిని ఇష్టపడతారు. 'మాజా' పోషకారి-దానిలో విటమిన్ ఎ.సి. & డి మరియు కాల్షియం ఉన్నవి. ఒక గ్లాసు మాజా పెద్దలకు ప్రతి రోజు కావలసిన 75% విటమిన్ సి ఇస్తుంది. నేడే మీ ఇంట్లో ఒక మాజా సీసా ఉంచండి.




— మీకు మరియు మీ అతిథులకు.
జీవితంలో మంచి వస్తువులు మాత్రమే
వాడే అలవాటు గల వారికి

*FREE! Write for Maaza Recipe Book which tells you all about the many delicacies you can prepare with Maaza, to Parle Beverages Pvt. Ltd., MID Department, Western Express Highway, Chakala, Andheri (E), Bombay 400 093*

విశ్వేష్ట్రాలయింది జానకి. 'తన అంతరంగాన్నితడెలా తెలుసుకోగలిగాడు!' కొద్ది సేపటి తర్వాత తేరుకొని అంది, "యెందుకలా అనుకుంటున్నారు?"

"అమ్మ అలా అనడం నాకే బాధకిపించింది. అసలు నువ్వు ఇంత తొందరగా మామూలు మనిషివౌతా వనుకోలేదు."

"ఏడుస్తూ కూర్చుంటాననుకున్నారా?" నవ్వుతూ అని "అలా యెప్పుడూ చెయ్యను. నాకు మీ కండ్లలో వెలుగే కావల్సింది.



**జరిగినకథ 4:** తొలి డాక్టర్ను, కొడుకు విజయ్ బలవంతముచేయగా భార్య జానకికి ఆపరేషన్ చేసి ఆమెను కాపాడిన డాక్టర్ మనోహర్‌కు డాక్టర్ శాంతి వల్ల మారిన తన వైవాహిక జీవితం గుర్తుకొస్తుంది. తన జీవితం తనవారి ఉన్నతికి పునాది కావాలని అనుకొన్న శాంతి, వాళ్ళ అవహేళనలకు గురౌతుంది. మనోహర్‌ను అపార్థం చేసుకొన్నానని బాధపడి, అతనికి క్షమాపణలు చెప్పుకోటానికి వాళ్ళ ఇంటికి వెళ్తుంది. అక్కడ మనోహర్ జానకిని హింసించటం చూచిన శాంతి అతనిని అసహ్యించుకుంటుంది. అపుడు అతడు జానకి వెనుకటి వృత్తాంతము ఆమెతో చెప్తుంటాడు. తన తల్లిదండ్రులను ఎదిరించి మేనమామ కూతురు జానకిని పెళ్ళి చేసుకొంటాడు మనోహర్.

అందుకోసం నేను దేనికైనా సిద్ధమే. యెవర్నీ లెక్కపెట్టను గూడా" అంది దృఢంగా.

"జానకీ..." ఇబ్బందిగా చూశాడు. "నీ మనసు నాకు తెలుసు జానకీ. కాని... కాని..."

"యేమిటి సందేహిస్తున్నారు? అయితే మీరు అబద్ధం చెప్పారన్నమాట."

"అబద్ధమా?" విస్మయంగా చూశాడు.

"కాదా నా మనసు తెలిసుంటే మీ రిలా చెప్పదలుచుకున్నది చెప్పేందుకు సందేహిస్తారా?"

"జానకీ, నీ మాటలు నన్ను నోరు విప్పనివ్వడం లేదు."

"అయితే నేను మాట్లాడను లెండి." అని నవ్విన ఆమె నవ్వుతో శ్రుతికల్పాడు

"జానకీ, నేను చెప్పినది విని, నన్ను స్వార్థపరుణ్ణని, నిన్ను చిన్నచూపు చూస్తున్నానని అనుకోవద్దు."

"మీకెలా నేను అర్థమౌతాను?"

"అర్థమయ్యావు గనుకే ఈ బాధ."

ఆశ్చర్యంగా చూసింది "బాధా?"

"నాకోసం దేనికైనా సిద్ధపడతానన్నావు ఔనా?"

"ఔను" మరోసారి దృఢంగా చెప్పింది.

"అమ్మ నాన్న ఆవేశంలో యేమన్నా నీవు బాధ పడగూడదు నామీద యెన్నో ఆశలు పెట్టుకొని ఇంతవాణ్ణిచేసి, శక్తికి మించిన చదువు చెప్పించిన తల్లిదండ్రులను, తోబుట్టువులను కాదనుకోడం న్యాయమా?"

"అలా అని నేను చెప్పానా?" జాలిగా అంది.

"చ ఛ. నువ్వన్నావనికాదు. ఆ పరిస్థితి రాకుండా చూడమంటున్నాను"

"అది మీరు చెప్పాలా? అదే నా కోరిక గూడా."

ఆమె కతడు ఇప్పుడు బాగా అర్థమయ్యాడు.

అతడి పెండ్లి విషయంలో అయిష్టత



# వంటలు

## సపోటాలు

కావలసిన వస్తువులు : బొంబాయిరవ్వ 1 గ్లాసు, పంచదార 2 గ్లాసులు, పాలు 1 గ్లాసు, డాల్డా పావుకిలో, జీడిపప్పు కొద్దిగా.

ఒక గ్లాసు పాలల్లో మరోగ్లాసు నీళ్ళు కలిపి పొయ్యి మీద పెట్టాలి. అవి కాగిన తరువాత రవ్వను శుభ్రపరచుకొని, ఆ పాలల్లో పోస్తూ ఉండలు కట్టకుండా తిప్పాలి. రవ్వ మెత్తగా ఉడికిన తరువాత దించుకోవాలి! తరువాత పంచదారను ఒక వెడల్పాటి గిన్నెలో వేసి కొంచెం నీళ్ళుపోసి, పొయ్యి మీద పెట్టుకోవాలి. పంచదార తీగె పాకం రాగనే క్రిందకు దించి వేరుగా ఉంచుకోవాలి. ఇప్పుడు పొయ్యి మీద బాణలి పెట్టి కొద్దిగా డాల్డా వేసి జీడిపప్పు దోరగా వేయించి తీసుకోవాలి! తరువాత మిగిలిన డాల్డా మొత్తం బాణలిలో పోసి బాగా కాగిన తరువాత, ఉడికిన రవ్వముద్దను నిమ్మకాయ సైజులో తీసుకొని, ప్రతిఉండ మధ్యన ఒక జీడిపప్పు పెడుతూ, గుండ్రంగా చేసి, డాల్డాలో వేయాలి! ఇవి ఎర్రగా వేగిన తరువాత తీసి తయారుగా ఉంచుకున్న పంచదార పాకంలో పడవేసుకోవాలి! ఇవి చల్లారిన తరువాత తింటే పాకం బాగా పీల్చుకొని చాల రుచిగా ఉంటాయి.

— టి వీరాదేవి.

## మొక్కజొన్న వడ

కావల్సిన వస్తువులు :— లేత మొక్కజొన్న పొత్తులు — నాలుగు, శెనగపిండి — 1 టేబుల్ స్పూన్, బంగాళాదుంప — ఒకటి, పచ్చిమిర్చి — 8 కాయలు, కొత్తిమీర — అర కట్ట, ఉల్లిముక్కలు, ఉప్పు, నూనె — తగినంత.

తయారు చేయు విధానము :— మొక్కజొన్న పొత్తుల నుంచి గింజలు వలచి కొద్ది నీరు చేర్చుతూ రోటిలో రుబ్బాలి. పచ్చిమిర్చి, ఉప్పు కూడా చేర్చాలి. బంగాళాదుంప ముక్కలు వేసి తిరిగి రుబ్బాలి. ఈ రుబ్బిన పిండిలో శెనగపిండి, ఉల్లిముక్కలు తరిగిన కొత్తిమీర వేసి కలపాలి. బాణలిలో నూనెవేసి కాగాక, ఈ పిండిని చిన్న చిన్న వడలుగా తట్టి వేయించాలి.

— వల్లి శ్రీ నాగరాజ్.

---

పెరిగిపెద్దచేసి బ్బిన తన వాళ్ళు, తన భార్యను ఏదో అంటారని, అందుకోసం ఆమె బాధపడి తనను వాళ్ళనుండి దూరం చేసే స్థితికి తేవచ్చునని భావించాడు. తన తర్వాత వాళ్ళ బవిష్యత్తులు తీర్చిదిద్దలేని స్థితిలో వున్న తల్లిదండ్రులను కాదని వెళ్ళిపోవడం రాక్షసత్వం. విపరీతంగా పెరిగిపోయిన అప్పులను కాదని తరలిపోవడం అన్యాయం.

భార్యయెడ తల్లి ప్రవర్తన చూసిన అతడు భార్యను మరింత ఓర్పుగా వుండి తన బాధ్యతలు తీర్చుకొనేట్లు చెయ్యమన్నాడు గాని అందుకామె చిన్న చిన్న కోర్కెలనుగూడా చంపుకోవల్సి వస్తుందని, మనిషిలో శక్తంతా ధారపొయ్యాల్సి వస్తుందనిగాని అనుకోలేదు. జానకి తనను ప్రేమిస్తోందని తెలుసు. కాని ఆ ప్రేమ కోసం, తన కండ్లలో కాంతి కోసం, తను బాధపడకుండా వుండడం కోసం ఆమె కొవ్వొత్తిలా కరిగిపోతుందనుకోలేదు.

ఆ రోజు సినిమా నుండి ఇంటికి వచ్చిన తర్వాత ఇంట్లో జరిగిన యుద్ధం యెప్పటికీ మరవలేనిది.

"చదువు సంధ్యా మానేసి షికార్లు తిరుగు. ఇన్నాళ్ళ నా శ్రమకు ప్రతిఫలం దక్కుతుంది." అంటూ చివాట్లు పెట్టాడు తండ్రి.

"వాడినని లాభమేముంది? పెండ్లి, పెండ్లి అని వాడి వెంటపడి చేసుకున్నది. ఆడిస్తున్నది. ఆ కాస్త చదువు కాగానే వాడు మన మాట వింటాడా? ఇక్కడ వుంటాడా?" పడుకొనేంతవరకు అరుస్తూనే వుంది తులశమ్మ.

చదువు పూర్తిగాకుండా పెండ్లి చేసుకున్నందుకు తనను తనే తిట్టుకున్నాడు. జుత్తు పీక్కున్నాడు.

అందరికీ అన్నాలు పెట్టి, అంట్లుతోమి పదకొండు గంటలు దాటిన తర్వాత గదిలోకి వచ్చిన జానకి భర్తను చూసి "ఈ మాత్రానికే ఇంత బాధపడితే యెలా? ఓర్పు, ధైర్యం లేకపోతే మనం సుఖంగా వుండలేము" అంది.

"యేమిటో, నాకు భవిష్యత్తు తలుచుకుంటేనే భయంగా వుంది" అన్నాడు.

"ముందేదో వుందన్న భ్రమే ఆనందం, భయం కలిగించేది. అది అనుభవంలోకి వచ్చేసరికి ఇంతేనా అనిపిస్తుంది పిచ్చిపిచ్చి ఆలోచన్లు మానేసి హాయిగా పడుకోండి" అంది.

* * *

శివయ్యరిటైర్డై రెండేళ్లు గడిచాయి. ఇంకా ప్రావిడెంట్ ఫండ్ గాని పెన్షన్ గాని రాలేదు. మనోహర్ సంపాదించే ఆ కొద్ది డబ్బే ఇంటి కాధారం కాగా, అతడు పరీక్ష ఫీజు కట్టేందుకు ఆలోచించుకోవల్సి వచ్చింది.

"ప్రేమ, దోమ అని ఆదర్శాలువల్లిస్తూ పెండ్లి చేసుకున్నావు ఇప్పుడు నిన్ను ఆదుకొనే దెవరు?" దెప్పిపొడిచాడు తండ్రి. వీలైనన్ని చోట్ల అప్పులు తెచ్చిన అతడు ఇక దారేదీ కనిపించక పోవడంతో కొడుకు కనిపిస్తేనే చిటపట లాడుతున్నాడు.

జానకికి కూడా 'తను తొందరపాటుగా ప్రవర్తించిందేమో!' నని బాధ కలిగింది. 'కాని తను మరొకర్ని మనువాడి మనుగడ సాగించగలిగేనా? పెండ్లి చేసుకోనంటే తల్లిదండ్రులు ఒప్పుకుంటారా?' ఆమె ఆలోచనెన్నో విధాలుగా సాగిపోతున్నాయి. 'జరిగిన దాన్ని గురించి అనుకొని లాభం లేదు. ఇప్పుడెలా?' అనుకుంటుండగా మెళ్ళో మెరుస్తున్న పుస్తెల గొలుసు మీదికి దృష్టి మళ్లింది.

పెండ్లప్పుడు తల్లిదండ్రులు తనకిచ్చిన కానుక అది. తటాక్కున తోచిన ఆ ఆలోచనను అమలు జరిపింది. పుస్తెలు పసుపు దారానికి చేర్చి, ఆమె మెడను చేరాయి.

టిఫిన తినేందుకొచ్చిన భర్త చేతిలో పెట్టిందా గొలుసును.

"జానకీ, యేమిటీ పని?" కోపంగా చూశాడు

# ప్రేమ పాశం

"ఇంతకన్నా, ఇప్పుడేం చెయ్యగలం?" అంది బేలగా.

"నిజమే కాని నీ..." చటుక్కున అతడి నోటిని మూసేసింది. "నేనే మీ నాన్నయినప్పుడు ఇక నా దంటూ ప్రత్యేకంగా యేముంటుంది?"

జానకి చేసిన పనికి ఇంటో వారి ప్రశంస లభించకపోగా సూటి పోటి మాట లధిక మయ్యాయి.

"భలే తెలివిగలవానివి వదినా. ఆగొలుసు ఇచ్చి అతి త్యాగమూర్తి వనిపించుకోవాలనుకున్నావు. ఇకముందు అన్నయ్య అలాంటి గొలుసు లన్నో చేయిస్తాడులే డాక్టరు భార్యవు గదూ మరి" అని రెండో కొడుకు మూర్తి అంటే,

"పేరుకు పేరు, డాక్టరు మొగుడు కావాలనేగా అదిలా వచ్చి ఇలా చెయ్యడం" అంది తులశమ్మ.

ఆనాటి నుండి క్రొత్త రకంగా సాగుతున్న వారి మాటలను భర్తతోగాని, తల్లిదండ్రులతోగాని చెప్పాలనిపించలేదు. 'వాళ్ళు బాధ పడడం తప్ప చెయ్య గలిగేదేమీ లేదని తెలిసీ యెందుకు చెప్పాలి?' అనుకుంది.

బంధువులింటికి పెండ్లికి వెళ్ళి వస్తుండగా బస్సు యాక్సిడెంట్లో రామయ్య, సీతమ్మ మరణించడంతో జానకి స్థితి మరీ అధ్వాన్నంగా మారింది.

కన్నవారిని పోగొట్టుకున్న ఆమెను సానుభూతిగా చూడాల్సిందిపోయి, మరింత కఠినంగా ప్రవర్తించ సాగారు.

వారి మాట లొక్కొక్కసారి విభ్రాంతి కలిగించేవి జానక్కి. తల్లిదండ్రులను పోగొట్టుకొని తను యేడుస్తుంటే, కొడుక్కు అత్తగారింట అచ్చటా ముచ్చట్లు లేవని అత్తగారు విపరీతంగా బాధ పడుతున్నారు. ఇంట్లో వారందరు ఆమెకు వంత పాడారు.

'ఎంత చిత్రమైన మనుష్యులు!' యేడుస్తూనే అనుకుంది జానకి అంత బాధనూ మరిపించేది మనోహర్ లాలిత్యం.

"జానకీ, పుట్టిన ప్రాణి యేదీ శాశ్వితం కాదు. చావుకేదో ఒక కారణం వుండాలి గాబట్టి బస్సు యాక్సిడెంట్లో పోయారు మీ అమ్మానాన్న. వాళ కోసం దిగులుపడి యేడ్చి ఫలితంలేదు. ఇక నుండి నేను భర్తనే కాదు, తల్లిదండ్రిని కూడా అనుకో. నాకు తెలుసు జానకీ, నీకీ ఇంట సానుభూతి లభించదని" అతడి మాటలు అనుకుంటుంటేనే కొండంత శక్తి వచ్చేది.

పరీక్షలు దగ్గరికి రావడంతో శ్రద్ధగా చదువుతున్న అతడ్ని తన గోడు చెప్పుకొని చిరాకు పరచలేదు. తన బాధను తనలోనే దిగమింగుతూ అతడి ముందు ప్రశాంతంగా వున్నట్లే నటిస్తుంది కాని ఆడది అపురూపమైన వరంగా భావించే వరం తనకు లభ్యమైందని తెలుసుకున్నప్పుడు వణికిపోయింది. ఆ భయాన్ని తనలోనే ఇముడ్చుకోలేక భర్తకు చెప్పింది.

"ఇప్పుడేం చెయ్యడం?" కలవరంగా చూసింది.

"చెప్పనా?" ఆమె కండ్లలోకి చూశాడు.

"ఊ" తొందరగా చెప్పమన్నట్టున్నది.

"ఇప్పుడిదేం పెద్ద సమస్య కాదు. అందులో నేను డాక్టర్నిగదా, ఇంక దిగులే లేదు. నీలో ఆ మాంసపు ముద్ద రూపు రేఖలు దిద్దుకోకుండానే తొలగించేస్తే సరి."

"ఏమండీ" అతడేదో చెప్తాడని ఆత్రంగా యెదురు చూస్తున్న ఆమె ఆ మాటతో మండి పడింది

"మీరిచ్చే సలహా ఇదా?" రోషావేశాలతో అంది.

"మరి తప్పు చేసిన వాళ్ళలా భయపడే వాళ్ళకింకేం చెప్పాలి?" కోపం, బాధ పెనవేసుకొచ్చాయతడికి.

"అదికాదండీ..." తననా ఇంట్లోవాళ్ళు దిక్కుమొక్కులేనిదని పుట్టింటి కానుకలు, ఆదరింపు, ఆతిధ్యాలు లేవని, సూటిగా అంటూ కించపరుస్తుంటే, ఇక ఇప్పుడేమంటారోనని ఆమె భయం.

"జానకీ. యెంతో సంతోషంగా అనుకోవల్సినదాన్ని, ఇంత విచారంగా అనుకోవల్సి వచ్చినందుకు కారణం నువ్వే." చురుగ్గా చూశాడు.

"నేనా?"

"ఔను. ప్రకృతి సిద్ధమైన వాటిని పొందేందుకు గూడా భీతిల్లుతున్న స్థితి కెందుకొచ్చావు? మంచితనం, ఓర్పుకు గూడా ఓ హద్దుండాలి. అందరి మాటలకు తలొంచి రాయిలా వుంటే వాళ్ళు మరింత రెచ్చిపోతారు. మంచి రాణించాలంటే కాస్త

# ప్రేమ పాశం

కటువు గూడా వుండాలి.''

అతడి మాటలకు లోలోపలే పేలవంగా నవ్వుకుంది.

వచ్చిన నాటినుండే తను రాగూడని చోటికి వచ్చినట్లు చూస్తున్న వారితో తనేం మాట్లాడగలదు? తల్లిదండ్రులు పోయిన తర్వాత తనలో చీము నెత్తురు పూర్తిగా చచ్చాయన్నట్లు మాట్లాడుతున్న వాళ్ళతో మొదట "యెందుకలా అంటారు? పేదరికం నా అపరాధం కాదు. తల్లిదండ్రులు పోవడం నా దురదృష్టం గాని, నేను కోరుకున్నది కాదు. వాళ్ళన్నా వారి సొమ్ము కావాలన్న ఆశ నాకు లేదు.'' అని వారి మాటల నరికట్టబోతే, "రోషానికేం తక్కువలేదు. వాళ్ళసొమ్ము కావాలని మేము యేడుస్తున్నామా? మాటలు నేర్చినదానివి గనుకే వాడ్ని బుట్టలో వేసుకున్నావు. ఆ కాస్త చదువు కాగానే వాడ్ని యెగరేసుకు పోతావని నాకు తెలుసు.'' అంటూ నాలుగు రోజులు సాధించిన అత్తగారి సాధింపు, అతడికి తెలిపి నొప్పించలేదు.

"నా తప్పేనేమో!'' అంటూ అతడి వైపు చూసి అన్న ఆమెకు అతణ్ణి తొందర పెట్టి పెండ్లి చేసుకోడం పొరపాటేమో ననిపిస్తే, 'తనివాళ్ళు ఇలా వుండడం పొరపాటనుకుంటున్న'దని అతడు భావించాడు.

'తప్పో ఒప్పో చేసిన దానికి అనురాగ ఫలం కలగబోతుంటే నిజంగా యెందుకు బాధపడాలి? భయపడాలి? అంతగా అవసరం వస్తే, ఈ సంసారాన్ని గూడా కాదంటుంది.' మొండి ధైర్యం ఆవహించగా హాయిగా నిద్రపట్టింది.

జానకి తల్లి కాబోతున్నదంటే, ఆమె ఊహించినట్లుగానే ఆ ఇంట యెవ్వరూ హర్షించకపోగా "దానికేం భాగ్యం?'' అంటూ విరసించారు.

"ఇక ఈవిడగారిని కూర్చోపెట్టి చెయ్యాలేమో!'' కోడలికి చెయ్యడం మహా తప్పన్నట్లు మాట్లాడుతుంది తులశమ్మ. ఆమె మాటలు వింటే జానకి దర్జాగా పడుకొని అత్త ఆడబడుచు చేత చేయించుకుంటున్న దేమోనన్న అనుమానం కలుగుతుంది.

ఇక శివయ్య అప్పుడే కొడుకు తమను కాదని, భార్యాబిడ్డలతో వెళ్ళిపోతున్నట్లుగా మాట్లాడాడు.

ఆ రోజు జానకి యేం నిర్ణయించుకున్నదో తెలియదుగాని మౌనంగా వారి మాటలు భరించింది.

ఆమె ఆశగా యెదురు చూపిన రోజులు రానే వచ్చాయి.

మనోహర్ ఎం. ఎస్. గూడా చేశాడు.

జానకి ఒక బిడ్డకేకాదు, నాలుగోబిడ్డకు కూడా తల్లి కాబోతున్న దిప్పుడు.

స్వర్ణ పుట్టిన రెండు నెలలకే శివయ్యకు గుండె జబ్బు రావడం, తులశమ్మకు పక్షవాతం వచ్చి కాళ్ళు పడిపోవడం జరిగింది. జానకి వారికి ఓర్పుగా సేవ చేస్తుంటే తమ మూర్ఖతను చూసి భయపడేవారు కొన్ని, కాళ్ళు పడిపోయి తన పనులకు కోడలిమీద ఆధారపడవలసి వచ్చినా నోరు తగ్గించలేదు తులశమ్మ. కాకపోతే ఇప్పుడు కొడుకు ముందు దురుసుగా మాట్లాడలేక పోతున్నది.

శివయ్యకు మాత్రం అప్పుడప్పుడే కోడలి మంచితనం అర్థమౌతున్నది. "ఆ పిల్ల చేసిన తప్పేమిటి?'' అని ఇప్పుడు తనకు తాను ప్రశ్నించుకొని పిల్లల్ని కూడా ఒప్పించాలని ప్రయత్నిస్తే, వాళ్ళు "అప్పుడీవిడ గారు అడ్డు పడకపోతే మన సంసారం అప్పులపాలయ్యేది కాదు. ఇప్పుడు అన్నయ్య సంపాదించే డబ్బు సగం అప్పుల కిచ్చుకొనే అవసరం వచ్చేదికాదు. యెదిగిన ఆడపిల్లలకు పెండ్లి చెయ్యలేని స్థితిలో ఉండేవాళ్ళం కాదు.'' అంటూ విరుత ప్రాయంతో తను నేర్పిన మాటలను మరింత విశదపరుస్తూ చెప్తారు. ఆ మాటలు విన్నా పట్టించుకోనట్లే వుంటుంది జానకి.

ఒక్కొక్కసారి ఆమె నిర్లిప్తత అతడ్ని కలవరపెడుతుంది గూడా. కాని పైకి యేమీ అవలేదు.

రాత్రి పదకొండువరకు పనిచేసే ఆమెకు సహాయపడదామని లలిత గాని సుమిత్ర గాని అనుకోరు. అలా తయారుచేసింది తల్లి. ఒకరకంగా జానకి లేటం బత్తెం లేని పని మనిషి లాంటిదేనన్న అభిప్రాయం పాతుకుపోయేట్లు చేసింది.

"జానకి తనను కోరి చేసుకొని యేం సుఖపడింది?'' మనోహర్ మానసం


"అపురూపమైన అందం !"

## ప్రేమ పాశం

బాధతో విలవిల లాడింది.

"సినిమాలకు షికారుకు వెళ్ళకపోయినా, మనసువిప్పి హాయిగా మాట్లాడుకొనేపాటి స్వేచ్ఛకూడా లేకపోయింది. తన కోసం అమ్మిన గొలుసుకు బదులుగా నాలుగేళ్ళ తర్వాత అతి ప్రశంసతో మరోగొలుసు చేయించి సంతోషంగా ఇంటికి తెస్తే నీకు పెండ్లామే యెక్కువయ్యిందంటూ తనను, ఇక నగలు నాణాలతో మురిసిపో — నేమెట్లాపోతే నీకేమని జానకిని దులిపేసిన తల్లిదండ్రులకేమని చెప్పగలడు? ఆమె త్యాగాన్ని గుర్తించమనా? లేక ఆమె అనురాగానికి ముగ్ధుడై ఆమె తన కోసం ఇచ్చిన దాన్ని తిరిగి ప్రేమ పూర్వకంగా ఇస్తేనే తనకు తృప్తిగా వుంటుందనా? వాళ్ళీవేవీ గ్రహించలేనంత మూర్ఖులు అయినప్పుడు చెప్పడం అనవసరం" అనుకొని మిన్నకుండి పోయాడు.

జానకికి తాను తీసుకువచ్చిన ఆ గొలుసు తప్ప ఆభరణాలేం దిగెయ్యలేదు.

మూడుపదుల ఆమె జీవితకాలంలో అనుభవించినది ఈ సంసారమనే నరకాన్ని. చివరికీనాడు క్రొత్తవ్యక్తి ముందు కూడా అవమానింపబడింది. జానకి ఇదివరకెప్పుడూ యెవర్నీ కోప్పడి యెరుగదు. కాని ఈ రోజు క్రొత్తవారి ముందు అవమానపడడం భరించలేక, సుమిత్రనలా కోపంగా పిలుపుతోనే హెచ్చరించింది. ఆమె ఇలాంటి స్థితి తెచ్చుకుందన్న ఆవేశమే తన విచక్షణా జ్ఞానాన్ని మింగేసింది. ఫలితం!' చేతివంక చూసుకున్నాడు.

శాంతి 'మీరూ అతి సాధారణమైన మగవాళ్ళేనన్నమాట' అంటే, 'కాదు. అందుకే ఈ ఆవేశం' అన్న నావకి మాటలు తనను రంపపు కోత కోస్తున్నాయి.

తనవర్షం నేను కోదండంలో జానకి యెప్పుడూ పొందలేదు. ఆ రాగమూర్తిని తను యేమాత్రం సుఖపెట్టలేకపోతున్నాడో కష్టం సుఖం చెప్పుకోవటందుకు కూడా యెవ్వరూ లేని ఆమె తన ప్రవర్తన వల్ల యెంత కుమిలిపోతుంటుంది? తనెందుకంత తొందర పడ్డాడు?" మదురు వెట్టుకున్నాడు.

(ఇంకావుంది)

# పెద్ద బైబిల్ !

ప్రపంచంలో కల్లా పెద్ద బైబిలు లాస్ ఏంజలిస్‌కు చెందిన లూయీస్ వాజువస్ అనేఆయన తయారుచేశాడట. ఈ బైబిలు నాలుగడుగుల ఒక అంగుళం పొడుగు, రెండడుగుల తొమ్మిదంగుళాల వెడల్పు వుందట. ఈ బైబిలులో 8043 పేజీలున్నాయట.

## గొలుసు మింగిన ఆడదొంగ !

ఢిల్లీలో ఓ సిటీబస్సులో రాజౌరీ గార్డెన్ చౌక్ ప్రాంతంలో ఒకావిడ సురీందరరాణి అనే అమ్మాయి మెడలోని బంగారుగొలుసు సర్రున లాక్కొని, ఎవరూ చూడకుండా గుటుక్కున మింగేసిందట. తన వెనుకనున్నావిడ మీద అనుమానం వచ్చి, సురీందరరాణి పోలీసులకు రిపోర్టిస్తే ఆవిడ తను తీయలేదని అరిచిందట. ఆవిణ్ణి ఆసుపత్రికితీసుకువెళ్ళి ఎక్సరే తీయించే సరికి గొలుసు మిలమిల్లాడిందట ఎక్స్‌రే ఫొటోలో. దాంతోఆవిడకు విరోచనాలమందిచ్చి గొలుసురాబట్టారట.

## పేకాటలో ఓడి కూతుర్ని అమ్మిన రైతు !

అకోలా జిల్లాకు చెందిన అమరునగర్‌లో ఓ వ్యవసాయదారుడు పేకాటలో మూడువేలు అప్పుబడి, అది తీర్చలేక, వేరేమార్గాంతరంలేక, తన పదమూడేళ్ళ కూతుర్ని ప్రక్కవూరులోని ఓ వ్యాపారికి అమ్మేసి ఆ డబ్బు పేకాటల్లో గెల్చుకున్న వాళ్ళకు కట్టేశాడట. ఆతని కూతుర్ని కొనుక్కున్న వాడికి ఆమెమీద ఏదో కారణం మీద కోపంవచ్చి చితకబాదితే, ఆ బాదుడు మోతాదు మించడం వల్ల ఆమెను తప్పనిసరిగా ఆసుపత్రిలో చేర్చాల్సివచ్చిందట. ఆసుపత్రిలో బెడ్‌మీద ఆమెను చూసిన మేనమామ విషయమంతా విని, పోలీసులకు రిపోర్టిచ్చాడట.

## అత్తింటి ఆరడులను భరించలేక ఆత్మహత్య

ఢిల్లీ మిల్ట్రీ స్కూల్లో సెక్షన్ ఆఫీసరుగా పనిచేస్తున్న మదన్‌లాల్ చేడీ అనే ఆయన హిందూస్థాన్ టైమ్స్‌లో పెళ్ళిళ్ళ కాలమ్ చూసి 27 ఏళ్ళ జితేంద్రచోప్రా అనే ఆతనికి తనకూతురు 24 ఏళ్ళ కాంచనకు 1978 ఫిబ్రవరి 28న పెళ్ళి చేశాడట. యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషను ఆఫీసులో స్టెనోగ్రాఫరుగా పనిచేస్తున్న కాంచన 780 రూపాయలు సంపాదించేదట. ఆమె చాలా కొంచెం కట్నం తెచ్చిందనీ, స్కూటరు, రిఫ్రిజిరేటరు, టెలివిజను వంటివి కొనుక్కోలేకపోయిందనీ, జితేంద్రుడు రోజూ ఆమెను చితకబాదేవాడట. ఆతని తల్లీ, చెల్లెళ్ళూ కూడా యథాశక్తి సహాయపడేవారట. కాంచనకు ఒక పిల్ల పుట్టినా కూడా ఆమె పరిస్థితులలాగే వుండేసరికిక



జీవితం అంటేభయంపుట్టి మొన్న జూన్ 27వతేదీన పుట్టింటికివచ్చి తన తండ్రితో అంతా చెప్పుకుని, భోరున ఏడ్చిందట. ఆ సాయంత్రం జితేంద్ర చోప్రా వచ్చిమామగారితో మాట్లాడి, భార్యనుతీసుకు వెళ్ళాడట. చెల్లెలితో ఆమె అన్నగారు సునీల్ కూడా వెళ్ళాడట. గుమ్మంలోపలకు అడుగు పెడుతూనే జితేంద్ర ఆమెను కాళ్ళతోనూ, చేతులతోనూ చావ బాదడం ప్రారంభించాడట. ఏం చెయ్యాలో తెలీని సునీల్‌పటేల్ నగర పోలీస్టేషనుకు పోయి రిపోర్టు యిస్తే, అక్కడ ఆ రిపోర్టే రికార్డు చెయ్యలేదట ఎవరూ. మర్నాడు వుదయానికల్లా కాంచన నిప్పంటించుకుని చావబోయిందనీ, చావుబ్రతుకుల మధ్య రామమనోహరలోహియా ఆసుపత్రిలో వూగిసలాడుతోందనీ కాంచన పుట్టింటి వారికి వార్త వచ్చిందట. ఏడు గంటలు [వుదయం] అయ్యేలోగానే ఆమె చనిపోయిందట. ఇది పటేల్‌నగర పోలీసువారు ఆత్మహత్యగా నమోదుచేశారట. కాంచన తండ్రీ, అన్నగారూ కలిసి పెద్దరగడ చేస్తే స్పెషల్ సెల్‌కి మారి తతంగంఅంతా బయటపడిందట.

## పెరుగుతున్న ఆత్మహత్యలు !

మన దేశంలో రానురాను ఆత్మహత్యలు చాలా ఎక్కువవుతున్నాయట. నిరుద్యోగానికి భయపడి, సుఖసంసార జీవితంలేక జీవితంమీద విరక్తి కలిగి, ప్రేమ వ్యవహారాలలో అపజయం వల్లా, అత్తల, భర్తల బాధలు భరించలేకయూ ఆత్మహత్యలు జరుగుతున్నాయట. 1976 లో మొత్తం 181,00 ఆత్మహత్యలు దేశం మొత్తంమీద నమోదు చెయ్యబడ్డాయట. అందులో 9491 మంది మగవారు, 8709 మంది ఆడవారూనట. సామాన్యంగా ఆత్మహత్యలలో ఉరితీసుకోడం, నీటిలో దూకడం, విషం త్రాగడం, రైళ్ళక్రింద పడడం, నిప్పంటించుకోవడం వంటి మార్గాలే ఎక్కువ రికార్డు అవుతున్నాయట. విషం త్రాగి 1976 లో 6811 మంది మగవారు, 5662 మంది ఆడవారూ చనిపోయారట. ఉరిపోసుకుని 5135మంది మగవారు, 2566 మంది ఆడవారూ చనిపోయారట. నీళ్ళల్లో దూకడం వల్ల 3854 మంది మగవారూ, 3866 మంది ఆడవారూ ఆత్మహత్యలు చేసుకున్నారట. రైళ్ళ క్రిందపడి 2007 మంది మగవారు, 563 మంది ఆడవారూ ఆత్మహత్యలు చేశారట. అత్తమామల పోరులు భరించలేక 2157 మంది ఆడవారు చనిపోతే, అదేకారణం వల్ల 1609 మగవారూ ఆత్మహత్యలు చేసుకున్నారట. భగ్నప్రేమికుల జాబితాలో 1130 మంది మగవారూ, 1039 మంది ఆడవారూ ఆత్మహత్యలు చేసుకున్నట్లు తెలిసిందట. 1974 లో 17204గా వున్న యీ ఆత్మహత్యలసంఖ్య 1976కు 18100గా పెరిగిందట. ఈ ఆత్మహత్యలలో రోగభయంతో, జీవితంమీద రోతపుట్టి చేసుకున్నవే ఎక్కువట.

## నీటి సరఫరా - పాల సరఫరా !

ఢిల్లీనగరంలో నీటి సరఫరాలో అనుకోని అవాంతరం ఏర్పడిన ఫలితంగా ఆ రోజు పాల సరఫరా కూడా కొంత అస్తవ్యస్తమవచ్చునని ఢిల్లీలో ఓ అధికార ప్రకటన ద్వారా కార్పొరేషను చేసిందట. ఫన్నీ !



## అదీ ఇదీ అన్నీ

ఆంధ్రులకూ, ఒరియాలకు ఇష్టదైవమైన

### 'చింతామణి అమ్మ'

తెలుగునాట సుప్రసిద్ధమైన దేవతాలయాలలో శ్రీకాకుళం జిల్లా కవిటిలోని శ్రీ చింతామణి అమ్మవారి ఆలయం ఒకటి.

ఆంధ్ర దేశానికి చివర, ఒరిస్సా సరిహద్దులలో ఉన్న ఇచ్ఛాపురం తాలూకాలోని చిన్న పల్లెటూరు 'కవిటి'. అటు ఇచ్ఛాపురానికి, ఇటు సోంపేటకు సరిగ్గా పదిమైళ్ల దూరంలో సాగర తీరానికి దగ్గర ఉన్న గ్రామమిది. ఊరికి రెండు ఫర్లాంగుల దూరంలో కొబ్బరితోటల నడుమ ఉన్నది చింతామణి దేవత గుడి. ప్రతిదినం అక్కడకు వందలాది మంది భక్తులు వస్తుంటారు. మంగళవారం సరేసరి– తీర్థయాత్రలా ఉంటుందక్కడ.

చింతామణి తల్లి ఒరియాలకు, తెలుగు వారికి కూడా ఆరాధ్యదేవత. రైతుల కామె పౌష్యలక్ష్మి, విద్యార్థులకాతల్లి సరస్వతి. సాముగరిడీలు నేర్చుకొనేవారికామె విజయ దుర్గ. జాలరులకు జలదేవత. దీర్ఘరోగులకు పునర్జన్మ ప్రసాదించే జనని. నూతన వధూవరులకు జయశుభ కారిణి. సంతాన హీనుల కామె సంతాన లక్ష్మి. అందరికీ ఆప్యాయంగా– పెద్దలకు పేదలకు కూడా ఆమె అమ్మ. ఇంతో మహిమాన్వితురాలైన దేవతగా ఆమెకు పేరున్నది. ఆమె శక్తిని గురించి ఎన్నోకథలు ప్రచారంలో ఉన్నాయి.

చింతామణి తల్లిని నమ్ముకున్న వారికి ఎప్పుడు అపకారం జరగదనే గట్టి నమ్మకం ఈ ప్రాంతం ప్రజలలో ఉంది. తరతరాలుగా ఆ దేవికి అర్చనలు సాగుతున్నాయి. ఏటా పండుగలలోను అతివైభవంగా సంబరాలు జరుగుతాయి. వేలసంఖ్యలో జనం వస్తారు. మొక్కుబళ్లు చెల్లించుకుంటారు. ఆ ప్రాంతం సుభిక్షంగా ఉండడానికి, ఆ గ్రామాలు సుఖ శాంతులతో ఉండడానికి చింతామణి దేవి కారణమని అక్కడి ప్రజల విశ్వాసం. "ఆ అమ్మ ఉన్నంతకాలం మాకు అగ్నిభయం లేదు- ఉప్పెనా రాదు-" అని ఒక వృద్ధుడన్నాడు. అక్కడి ప్రజల నమ్మకానికి ఇది ఒక ఉదాహరణ మాత్రమే.

— పద్మా గోపీనాథం.



## నెఫా కళోత్సవాలు

నెల్లూరు ఫిలంజర్నలిస్టులు ఆధ్వర్యాన ఆగస్టు 12 నుండి 17 వరకు అఖిలభారత స్థాయిలో నెల్లూరు టవునుహాలులో నాటకకళాపరిషత్తు జరిగింది.

### పోటీ ఫలితాలు

ఉత్తమప్రదర్శన: డ్రామా నల్లగొండవారి శరణం గచ్ఛామి, ఉత్తమనటుడు: జయప్రకాష్‌రెడ్డి, ఉత్తమదర్శకుడు: జయప్రకాష్‌రెడ్డి.

నాటికలు: ఉత్తమప్రదర్శన: దర్పణ ఆర్ట్స్ థియేటర్ హైదరాబాద్‌వారి గరళ, ద్వితీయ. జాగృతికళానిలయం ఒంగోలువారి సర్పయాగం: ఉత్తమనటుడు: సర్పయాగంలో పరీక్షిత్తు పాత్రధారి [ఒంగోలు] వి. యస్. కామేశ్వరరావు, ఉత్తమ ద్వితీయ నటుడు: [illegible] పాత్రధారి కె. వెంకటేశ్వరరావు [illegible] ఉత్తమనటి. [illegible] పాత్రధారిణి [illegible] [illegible], ఉత్తమద్వితీయనటి: [illegible] [ఒంగోలు], ఉత్తమదర్శకత్వం. గరళ దర్శకుడు జి. హరిరాం [హైదరాబాద్], ఉత్తమహాస్యనటుడు: గారడిలో ప్రేక్షకుడు పాత్రధారి [illegible] [హైదరాబాదు], ఉత్తమవిలన్: పరిస్థితుల మోడుపెయ్యిలో ప్రెసిడెంటు పాత్రధారి జి. కొండలరావు, ఉత్తమ రచన: సర్పయాగం రచయిత శ్రీ వి. ఎస్. కామేశ్వరరావు [ఒంగోలు], ఏక పాత్రాభినయం [పౌరాణికము]: శ్రీ పి. హనుమంతరావు [పెంగుళూరు] సాంఘీకము: శ్రీ ఏ. రంగారావు బండ్లమూడి [గుంటూరుజిల్లా].




Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.